భారతీయ సాహిత్య నిర్మాతలు

# కంబ మహాకవి

ఆంగ్ల మూలము:
ఎస్. మహారాజన్

తెనుగుసేత:
మరుపూరు కోదండరామ రెడ్డి



సాహిత్య అకాడెమీ
న్యూఢిల్లీ

KAMBA MAHAKAVI—Telugu translation by Marupuru Kothanda Rama Reddy of the English monograph entitled KAMBAN by S. Maharajan. Sahitya Akademi, New Delhi, 1977. Price Rs. 2-50.



*First Edition : 1977*

SAHITYA AKADEMI
Rabindra Bhavan, New Delhi-1
*Regional Offices :*
Madras-6, Calcutta-29 & Bombay-14

Published by Sahitya Akademi and Printed at
Weldun Press, 7/1, Mannappa Mudali Street,
Madras-600 021.

# విషయసూచిక

# నివేదన

భారతీయ భాషలన్నీ సమగ్ర భారతీయ సంస్కృతి తారహారమందు ముత్యాల పూసలు; భారతీయతే అందు సూత్రము. కన్యాకుమారి కాశ్మీర పర్యంతభూమిలో ఈ ఐక్యత ప్రతి విషయంలోనూ గోచరిస్తూనే ఉన్నది. ఇదే అఖండ భారతీయ సంస్కృతి విశిష్టత!

మన దేశ వివిధభాషలయందలి విషయాలను ఒకరొకరికి తెలియ జేయుటే సాహిత్య అకాదెమీ లక్ష్యాలలో ఒకటై, ఆ కార్యసరణి ప్రశంసనీయ కృషిని చేస్తున్నది. దీనివలన వివిధప్రాంత భాషాస్వరూపాలను ఆయా సారస్వతములందలి మహామహుల కృతులను అన్ని ప్రాంతాలవారూ తెలుసుకోగలుగు తున్నారు.

ముఖ్యంగా దాక్షిణాత్య భాషలన్నిటిలోను ఒక నాగరకాభిరుచి-జాతి వికాస ఐక్యత, భావసామరస్యము, భాషాసారూప్యము గోచరిస్తున్నవి. ఇంతవరకు సామాన్యంగా మనం సంస్కృత వాఙ్మయ రుచినే చవిజూడగలిగి యున్నాము. ఆవల ఇంగ్లీషువల్ల అంతర్జాతీయ సాహిత్య పరిచయం కొంత కలిగినది. ఇప్పుడు మన ఇరుగుపొరుగు ద్రావిడభాషల సంపదను మనం పంచుకొని ఆనందించే ప్రయత్నం నలుగడలా కనిపిస్తున్నది. ఆ అవకాశాన్ని అకాదెమీ బాగా ఉపయోగించు కొంటున్నది.

దాక్షిణాత్యభాషలలో తమిళము, క్రీస్తు శకారంభంలోనే ఒక ప్రత్యేక స్థానిక గుణంతో-అనగా, దేశిరూపంతో పూర్ణవికాసం బొందినది. కంబ మహాకవియే (9-12 శ.) మొదట సంస్కృత మహాకావ్యమైన వాల్మీకి రామాయణాన్ని తమిళ భారతీదేవి పీఠాన సమర్పించినవాడు కావచ్చును. కన్నడాంధ్రాలు సంస్కృత ప్రభావితాలై, వాని కావ్యానువాదాలనే తమ వాఙ్మయంగా చేసుకొన్నవి.

తమిళులకు కంబరామాయణం వర్ణవర్గ భేదాతీతంగా సమష్టిసంపదై యున్నది. కంబకవి శూద్రుడు. ఈ మహాకావ్యాన్ని, ఆ కవిచక్రవర్తి కవితాశిల్పాన్ని ఎస్. మహరాజన్‌గారు రమ్యఫణితిలో ఆంగ్లంలో సంగ్రహ రూపంగా వ్రాసినాడు. దాని **అనువాదం** నాచేత చేయించిన - సాహిత్య అకాడెమీ దక్షిణ ప్రాంతీయసంఘానికి నిండు మదితో నెనరు తెలుపుకొం టున్నాను. ఈ విషయంలో-పెద్దలు శ్రీ దేవులపల్లి రామానుజరావు (ఆంధ్ర ప్రదేశ సాహిత్య అకాడెమీ కార్యదర్శి) డాక్టర్ చల్లా రాధాకృష్ణశర్మ (అకాడెమీ దక్షిణప్రాంత సంఘ కార్యదర్శి) గారలకు ప్రత్యేక అభివందనాలు.

మహరాజన్‌గారి ఆంగ్లభాష,పాండిత్య ప్రకర్షకము-ప్రౌఢ మనోజ్ఞము. దాని సౌభాగ్యాన్ని ఈపాటి అయినా తెనుగులోనికి దించను నాకు సహాయ పడిన శ్రీ వేదం వెంకటరామన్ (నెల్లూరు రాజాగారి కళాశాల ఇంగ్లీషు అధ్యాపకులు, బహుభాషావేత్తలు, విమర్శక గుణవిశిష్టబుద్ధులు); కాళహస్తి రామనాథం (ఎం.ఏ.,బి.ఇడి) గారలకు హృదయపూర్వక కృతజ్ఞత. ఇవి వట్టిమాటలు గావు. నమస్తే.

‘అవర్ణ’
జేమ్సుగార్డన్-నెల్లూరు
5-2-1977

**మరుపూరు కోదండరామ రెడ్డి**

# పరిచయము

ఈ వ్యాసభాగాలను త్వరితగతి చూచినంతమాత్రాననే, ఈ అనువాదకుడు ఓజస్సు గుణవిశేషము గలిగిన ఒక కవిని, ఒక మహా ఇతిహాసాన్ని చేపట్టినట్లు నాకు స్పష్టమైనది. జగద్విషయిక శక్తికి మానవ రూపకల్పన చేయుటలో కంబకవికి గల సహజ ప్రజ్ఞాపారమ్యము ఈ కృతిలో–పారలౌకిక ఉదాత్త విషయాలను కేవల మానవగుణ వివరాలతో అనుసంధించి కళాపూర్ణ రూపాన్ని సృష్టించగలుగుతున్నది. ఆయన, మానవానుభవ ప్రపంచాన్నే అభివర్ణిస్తున్నాడు; ఇక తన కవితా శిల్పోష్కర్షతో ప్రపంచ మహోన్నత కావ్యసృష్టులు అభిలషించిన సత్ఫలితాన్ని ఆయన పొందుచున్నాడు. ఇది, దివ్యము–అపౌరుషేయము–కాలాతీతము అయిన దానిని, భూతలాత్మకము–అనుభవజన్యమైన దానితో పరిణయము చేయుటయే!

కంబరు ఇంగ్లీషు భాషాప్రపంచము ఎరుగవలసిన కవి యనుట యథార్థము. ఈ మహరాజన్‌గారి మనోజ్ఞమైన అనువాదం చదివి, వారు తమ విజ్ఞానాన్ని పెంచుకోగలరు.


ఇంగ్లీషు భాషా శాఖ
ఉటా విశ్వవిద్యాలయము
సాల్ట్‌లేక్ సిటి
అమెరికా సంయుక్త రాష్ట్రములు

ఎడ్వర్డ్ ల్యూడర్సు

# అవతారిక

ఈ ఇరవయ్యో శతాబ్దంలో - తమిళనాడులో ఈనాటికీ కంబకవిపట్ల గల అపూర్వ ఉత్సాహాంధ లోకప్రీతినిబట్టి చూస్తే-ఒక విదేశీయుడు కంబుడు ఈనాటి కవి అని, ఈనాటి ఆసక్తి పూర్ణ సమస్యలనే గానం చేసినాడని అపోహపడవచ్చు. కాని, ఈ ఊహ గురికి పదకొండు శతాబ్దాల దూరంలో ఉన్నది; ఎందుకంటే-కంబ మహాకవి పుట్టి మని గిట్టినది క్రీస్తుశకం తొమ్మిదో శతాబ్దంలో. ఇన్ని ఏండ్లుపూండ్లు గడచిపోయినా, ఆయన మహిమోపేత కవితాశక్తియొక్క పట్టు ప్రజలపై సడలిపోలేదు. దీనికి కారణం--ఈ కాలాతీత సమస్యలను ఆయన ఒక విస్పష్ట కవితాఫణితిలో చెప్పినాడు. ఇవి శాశ్వత సమస్యలు; సృష్ట్యంతంవరకు మానవుని ప్రకృతిభావాలను ఆకర్షించి, ముగ్ధులను చేస్తూనే ప్రత్యుత్తరాలను అపేక్షిస్తుంటవి.

కంబరుకు ముందు ఒక అవిచ్ఛిన్నమైన కవితాసంప్రదాయం వెయ్యేండ్లుగా సాగివస్తూనే ఉండినది. ఆనాటి సాహిత్య వసంతపు తొలినాటి కవులకు లభించిన అవకాశాలు ఆయనకు అందలేదు. ఆయన రాకకు ముందే తమిళబాష ఎందరో సిద్ధహస్తులచేత ప్రయుక్తమై ఉండినది. ఆ భాష ఇంకా ఆదాన ప్రదానాత్మకమై వర్ధమానస్థితిలో ఉండినప్పుడే-క్రీస్తుశకానికి ముందే, సంఘ కవులు దానికి పదర్పణమైన లాలిత్యమును చారు గంభీరమైన సారళ్యతను ఒనగూర్చి ఉంచినారు. ఆపైన క్రీస్తుశకం రెండో శతాబ్దంలో తిరువళ్లువర్ (తిరుకురళ్) కాంతిమంతమైన ప్రసన్నతాగుణమును, సూక్ష్మ స్ఫుటీకరణశక్తిని, సంక్షిప్తరీతిని ఈ భాషకు ప్రసాదించినాడు. వీటిచే ప్రభావితుడై డాక్టర్ గ్రౌల్ అనే పాశ్చాత్య పండితుడు, తిరువళ్లువరు ద్విపాదపాటలను - "రజత జాలాపటంలో బిగించి అల్లిన సువర్ణఫలాలు" అని పొగడకుండా తప్పించుకోలేకపోయినాడు. సిద్ధపురుషులైన వైష్ణవ ఆళ్వారులు శైవ భక్తులైన నాయనమారులు 6-9 శతాబ్దాల మధ్య తమిళభాషకు ఒక అసాధారణ పేశలతను, అప్యాయనంతోగూడి హృదయస్పందనకారియైన గీతికా

ధర్మమును సిద్ధింపజేసినారు. ఈ రీతిగా కంబుడు కవితారంగంలో ప్రవేశించేదానికి ముందే ఎప్పుడో, ఆ భాషకుగల సర్వశక్తులు సర్వరీతులు పూర్తిగా కొల్లగొట్టబడినట్లు తోపింపజేస్తున్నది. ఇన్ని ప్రతిబంధకాలు ఉన్నప్పటికిన్నీ, కంబకవి బుద్ధివైభవము-భాషకు ఒక వీర్యవంతమైన వ్యక్తీకరణ శక్తినిచ్చి, స్వచ్ఛ కవితా సంపూర్ణసిద్ధికి ఉపకరించినది.

ఆయన తన కవితావస్తువుగా రామాయణాన్నే ఎన్నుకొన్నాడు. ఎందు కంటే-రాముని కథ సరళమైనది; మహాభారతమునందలి విషయ సంకీర్ణతకు దూరమై ఉన్నది. ఈ వివిధ విషయ సంకులత-మానసికానందదాయినియై వ్యథానివారణ దక్షమైన కవితాసౌభాగ్యాన్ని అనుభవించనీయక పాఠకుని ప్రక్కత్రోవలకు నెట్టవేయుచుండును. అనేక శతాబ్దాలుగా తమిళులకు రామాయణ కథారేఖలు బాగా తెలిసియే ఉండినవి. ఆ కథయందలి వివిధ ఘట్టాలను ఆళ్వారుల భక్తిగీతాలమూలకంగా విని ఆనందించి పరవశించిపోతూనే ఉండినారు. ఈ పరిచయ సన్నివేశలాభాన్ని కంబకవి గుర్తించినాడు. అందువల్ల పాఠకుని మనస్సును కథాభాగంనుండి సులభంగా మరలించవచ్చునని తెలుసుకొని, తన కవితాశిల్ప ఉపజ్ఞ-తన అద్భుత రామణీయక కల్పనాశక్తి-తన నాటకీయ కదకసామర్థ్యము- వీటిపైన పాఠకుని మనస్సును సులభంగా లగ్నం చేయించగలిగినాడు. అందువల్లనే తన ప్రస్తావన వచనాలలో, కవిత్వ మాహాత్మ్యాన్ని దివ్యత్వాన్ని ప్రదర్శింపబోతున్నానని సగర్వంగా చాటుకొన్నాడు. ఈ బడాయిమాటను తన రచనలో ఆశ్చర్యజనకంగా నిలబెట్టుకొన్నాడు.

నిజానికి కంబరామాయణ పుట్టువుతో తమిళకవిత్వ భవిష్యత్తే మారిపోయినది. అదిమొదలు ఈ పదకొండు శతాబ్దాలుగా ఈ మహాకృతి తమిళుల విషయగ్రహణ దక్షమైన కవితాస్వరూపంతో గాఢసంపర్కము ప్రభావముకలిగే ఉంటున్నది. ఆ కంబ మహాకవి కాలంనుతా నేటివరకు, విద్వాంసుల పరంపర కంబరామాయణ పాటలు పాడి, దాని రామణీయక సౌభాగ్యాన్ని వివరించి చెపుతూ తమిళనాటిని చకితంచేస్తూనే ఉన్నది. ఇట్టి ప్రవచనకులు కీర్తన గాయకుల పోషణార్థమై తమిళనాడులో చాలామంది ప్రభువులు మడి మాన్యాలిచ్చి పోషిస్తుండినారు. చుట్టుప్రక్కల- కేరళ కర్ణాటక ఆంధ్రప్రాంతాలలోగూడ-తమిళం వారి మాతృభాష కాకపోయినా, ఈ కంబ

రామాయణ ప్రవచనాలను విని ప్రజలు ఆనందిస్తుండినట్లు శిలాశాసనాలు ఎన్నో ప్రకటిస్తున్నవి. ఈ విధంగా జనసామాన్య విద్య-సంస్కృతులను పోషించి పెంచుటలో కంబకవి ఒక శక్తిపూర్ణమైన సాధనమైనాడు. దక్షిణ దేశమందంతటా ప్రజల దృక్పథాన్ని శీలాన్ని లలితకళా రసికతను ఆధ్యాత్మిక జీవనలక్ష్యాన్ని ఆయన నవ్యరీతులలో రూపొందించగలిగినాడు. అందువల్లనే ఆయన రామాయణం శాశ్వత జాతీయస్మృత్యంకంగా నిలిచిపోయినది. ఆ దేశప్రజలు పండితులు కవులు కంబుని కవిచక్రవర్తిగా పట్టాభిషేకము చేసినారు. దీనితో చరిత్రలో ఆయన మహా పండితకవిగా చాటబడినాడు. ఎన్నటినుండియో పౌరాణికులు, నెలలతరబడి విడువకుండా కంబరామాయణ కాలక్షేపం చేస్తున్నా, ఈనాటికీ ఆడమగ పిన్నలు పెద్దలు-ముప్పయి నలభై వేలమంది గుంపుగట్టి ఈ ప్రవచనాలను తదేక తన్మయధ్యానంతో విని, కంబకవి పాటలకు ఆనందించి, తలలూపడమే ఒక వింత! వేయేండ్లకు పైన ప్రజాహృదయాలపై పట్టు సడలించకుండా వారి ఆసక్తిని ఆకర్షించేదానికి ఈ కవిలో, ఏదో కాలదోషంపట్టని అద్భుతగుణం ఒకటి ఉండాల. కంబుడు ఏనాటికీ పాతబడడు. ఎందుకంటే-మనతోనేగాక సర్వప్రపంచంతో, ఆయన భవిద్వాణితో మాట్లాడుతున్నాడు.

**ఎస్. మహరాజన్**

# 1

# కంబకవి కాలము

కంబ మహాకవి జీవించియుండిన కాలాన్ని గురించి పండితలోకంలో కొంత వివాదమేర్పడి యుండినది. ఒక మతంప్రకారం క్రీ. శ. 9 వ శతాబ్దంలో వెలసి ఉండినాడు; ఇదే ఎక్కువ ఆమోదయోగ్యంగా కనబడుతున్నది. ఇంకొక సిద్ధాంతం ప్రకారం ఆయన 13 వ శతాబ్దంవాడు.

అయినా కంబకవి నివాసస్థానాన్ని గురించిమాత్రం పండితలోకంలో ఏకాభిప్రాయమే ఉన్నది. నేటి తంజావూరుజిల్లా, మాయవరం తాలూకాలో తిరువళుందూరు (తేరళునూర్) గ్రామవాసి. అక్కడి పెద్ద భూస్వామి – సదయప్ప వళ్లాళ, కంబుని కవిత్వానికి ముగ్ధుడై కొనియాడి పోషించినాడు. ఈ కవితాపోషకుడే కంబరు ధీశక్తిలో ఉన్న మెరుగులన్నిటిని బయటకు లాగ గలిగినాడు. ఈ సాహిత్యకృషి ఆయన ప్రోత్సాహజనితమే.

ప్రజల ఊహాపోహలు కంబరు అనే పేరుచుట్టు ఎన్నో కథలు అల్లి ఉన్నవి. ఈ కట్టుకథలన్నీ చారిత్రికాంశాలుగా పూర్తిగా నిష్ప్రయోజనాలు. అయినా, ఇవన్నీ తమ కవిచక్రవర్తి ప్రజ్ఞావిశేషాన్ని పరిశోధించి వెలగట్టుటకు, కవితాప్రియులు చేసిన ప్రయత్నస్వరూపాలే అవుతున్నవి.

ఒక జానపదగాథ ప్రకారం:—ఒక చోళమహారాజు ఆస్థానంలో ఉండిన ఒక సామాన్య కవి-ఒట్టకూత్తరు అనువాని సమకాలికుడు-కంబకవి. ఛందఃశాస్త్ర పాండిత్యము పద్యరచనా శిల్పపాటవముగలిగిన ఒట్టకూత్తరు ఆనాటి సాహిత్యప్రపంచంలో ఒక నిరంకుశాధికారాన్ని సాగించుకొంటుండినాడు. ఆ రాజు ఈ కవికి ఎంత అధికారమిచ్చినాడంటే-పిల్లకవులు కుకవులు

ఎవరుగాని తెలియకనే ఛందస్సునుగాని కారక ప్రక్రియనుగాని వ్యాకరణ మునుగాని తప్పినంతమాత్రాననే అట్టివారి శిరచ్ఛేదం చేయనుగూడ ఇతనికి అధికారముండినది. కంబకవి ప్రవేశంతోగూడ ఇదంతా మారిపోయినది. ఆయన కవితా శేముషీవిభవము అంతకుముందున్న సాంప్రదాయిక స్వభావ స్వరూపాలన్నిటిని ఛిన్నంచేసి, కర్ణపేయమైన నూతన మధుర శబ్దబంధాలను సృజించినది. ఇవి ఆ ఒట్టకూత్తరు సర్వసామాన్య కవితాగాన విధానాన్ని అధిగమించి ప్రజామోదాన్ని పొందినవి. దీనితో ఆ చోళమహారాజు కొలువులో ఒట్టకూత్తరు పలుకుబడి తరిగి, మాట సాగకుండాపోవడమే గాకుండా, అతని స్థానంలో కంబుడే ఆస్థానకవి అయినాడు.

ఒకనాడు, రాజు కొలువుదీరి, ఆ ఇద్దరు కవులను రాముని ఇతిహాస కథను పద్యరూపంలో వ్రాయమని కోరినాడు. వెంటనే ఒట్టకూత్తరు వ్యగ్రోత్సాహంతో రచన ప్రారంభించి శ్రమించి పసలేని పేలవమైన కవిత్వాన్ని అల్లను ప్రారంభించినాడు; చాలావరకు సాగినాడు. అయితే కంబరుమాత్రం వ్రాత మొదలుపెట్టాలనే ఇంతవరకు అనుకోలేదు. చిలిపి వినోదాలతో కాలం గడుపుతుండినాడు. ఇట్లా కొంతకాలం జరిగిన తర్వాత, రాజు ఇద్దరు కవులను పిలిపించి, రచన ఎంతవరకు సాగినదో చెప్పమన్నాడు. కంబకవి ఆరవకాండ (యుద్ధకాండ) వరకు వచ్చినానని, లంకకు రాముని వానర బలగం నిర్మిస్తున్న వారధిని వర్ణిస్తున్నానని, ఇదే రామరావణ చరమయుద్ధానికి ఉపక్రమమని, తటాలున ముందువెనుక లాడక చెప్పివేసినాడు. ఆ అల్లికనంతా వింటుండిన ఒట్టకూత్తరుకు, కంబుడు ఇంతవరకు రచననే ప్రారంభించలేదని బాగా తెలుసును. ఆ ధైర్యంతో వంతెనగట్టే ఘట్టంలో ఒక్క పాట చెప్పమని నిలబెట్టి అడిగినాడు. వెంటనే కంబకవి కూసువిస్సగా తడవుకోకుండా అప్పటికప్పుడే ఆశువుగా ఈ పాట చెప్పినాడు:

వానర ముఖ్యుడు కుముదుడు
　　విసరె పెనుశిలనొండు శిలామయ జలధిబడగ;
సర్తకీ పదలాస్యగతుల బెంప
　　అదియు కొండ చరియలదొ
అందు అది మథించి ఘూర్ణించి
　　శీకరాసారతతిచేత తడిపె స్వర్గసిమనెల్ల:

మరల దుగ్ధవారాశిలోన
సుధాపూర ముద్భవించి
తమ్ము జేరునన్న ఆశతో
ఆడిపాడిరి అమరులెల్ల!

అట్టి కంబకవి ఆశుకవితాదీప్తికి ఒట్టకూ్కత్తరు అసూయానల దుర్విదగ్ధుడై, అందలి "తుమి" పదప్రయోగంమీద తప్పు బట్టినాడు. కంబరు తుమి అంటే తుంపురు అన్నాడు. దానిపైన, సరియైన పదం తుళి గాని తుమి గాదని ఆ పండితుడు అధిక్షేపించినాడు. కాని, కంబకవి ఆ పద ప్రయోగం ప్రజావాణికి ఆమోదకరమని తెగనాడినాడు. ఒట్టకూ్కత్తరు-అట్లయితే ఆ ప్రయోగాన్ని నిరూపించి నిలబెట్టమని ధిక్కరించినాడు. అంతట కంబకవి, తన ప్రతిపక్షిని, రాజును, ఇంకా కొలువులో ఉన్నవారిని ఉన్నట్లు గానే లేవదీసుకొని, తన వెంటబెట్టుకొని నగరవీధులలోకి పోయినాడు. అట్లా పోయి వారు ఒక గొల్ల యింటిముంగు పంచలో పెరుగు చిలుకుచుండిన ఒకతెను చూచి నిలిచినారు. తరి కుండచుట్టూ మూగి ఆడుకొంటుండిన పిల్ల కాయలతో ఆ వ్రేత-"ఇదిగో దూరంగాపొండి, లేకుంటే మజ్జిగ తుమి(చిట్టలు) మీమీద పడతవి" అనడం వారందరూ విన్నారు. ఈ మాటలు అని, చిలుకు చుండిన ఆ గొల్లభామ అద్భుతవిధాన అంతర్ధానమై, వారికి ఆశ్చర్యం కలిగించినది. అప్పుడు ఒట్టకూ్కత్తరు, చదువులరాణి సరస్వతీదేవియే, కంబ మహాకవి పదసృష్టిని నిలబెట్టేదానికి స్వయంగా గోపికారూపంలో దిగివచ్చినదని తెలుసుకొన్నాడు.

దీనితో గుండె బ్రద్దలై ఒట్టకూ్కత్తరు నేరుగా ఇంటికిపోయి, నిఘంటువులు వెదకి చెమటూడ్చి ఎంతో కష్టంమీద వ్రాసిన తన రామాయణాన్ని ముక్కచెక్కలుగా చించి పారవేయ మొదలుపెట్టినాడు. యాదృచ్ఛికంగా కంబకవి, తన ప్రతిరోధి ఇంటికి ఇదే అదనున పోవడం తటస్థించినది; అప్పటికి కడపటి ఏడవకాండ-ఉత్తరకాండమాత్రం చింపుడుబడక నిలిచియుండినది. వెంటనే, నిజ విలక్షణ ప్రసాదమతితో తన విరోధిచేయి ఒడిసిపట్టుకొని ఉత్తరకాండను చింపకుండా ఆపి, తాను వ్రాయవలసిఉన్న రామాయణంలో ఆ భాగాన్ని ఉత్తరకాండగా అనుసంధించేదానికి అతని అనుజ్ఞను పొందినాడు.

నేడు సంఘం, తన లోతును పరపును మరచి, పైపై మెరుగులతో తృప్తిపడే ముప్పునబడనున్న తరుణంలో. ఆ సంఘ క్షేమానికిగా కంబ మహాకవి సందేశాన్ని సమీక్షించుకోవడం వాంఛనీయము. కంబునికి జీవన భరణ పరమార్థసమస్య నిరంతర గంభీరమైనది. ఈ ఇతిహాసంలో క్షణిక విషయాసక్త మతిని మూగబొయ్యేటట్లు ఎంతో మెలకువగా చేయగలిగినాడు. దీనితో ఆ పరమార్థవాణిని సదా వినగలుగునట్లు పాఠకునికి మానసానికి శ్రుతిని మేళవించినాడు. అంతర్ జ్ఞానోపదేష్టమైన ఆయన వర్ణనాశక్తి సత్యం శివం సుందరముల సచేతన పరిపూర్ణత్వాన్ని మనకు చూపించి, మన ఆత్మ శక్తిపోషకమై అహంకార కాఠిన్యమును లయింపజేసి, ఆనందవిషయికమైన ఒక నూతన దృష్టిని మనలో ప్రేరేపిస్తున్నది. అట్టి ఆనందంలో కొంత అయినా ఈ ఆంగ్లానువాదం (ఆంధ్ర) పాఠకునికి కలిగించగలదని ఆశపడు చున్నాము.

# 2

# బాలకాండము

## రాముని కన్నె కయ్యము

కంబకవి వర్ణించినరీతిలో రాముని కన్నె కయ్యాన్నిగురించి త్వర త్వరగా క్లుప్తంగా సమీక్షించుకొందాం:- విశ్వామిత్ర మహర్షి, దశరథ మహా రాజు ఎంత కాదన్నా ఆయన అభిమతానికి వ్యతిరేకంగా, బాలురు-రామ లక్ష్మణులను వెంట దోడ్కొనిపోయి ఒక భయద మరుభూమిని దరిసినాడు. కవి వర్ణనము-ఆ ముగ్గురిని మొదట నేత్రపర్వమైన హరితశాద్వల రమ్యమైన కాననములగుండా కొంతదవ్వు నడపించి; పర్వతసానువులునుండి అసమ శిలాతలాలపై దుముకుచు-సమతలాలపై ఆగి కొంతదూరం ప్రశాంతంగా ప్రవహిస్తూ, ఒకచోట ఉన్నత తటాలనుండి జారిపడి జలపాతాలగుచు రేపిన

శీతల శీకరాసారాలచేత చల్లటి హాయినిగూర్చే సెలయేర్ల దరులమీద నడిపించి, ఆ నిర్జన నిర్జల కఠోరభూమి నిర్జీవ భయదశూన్యత కనులకుగట్టునట్లు కవి చేస్తున్నాడు. ఒకచోట ఎగిరి, ఇంకొక చక్కిదూకి, మరియొక నెలవున ఆగి పయనిస్తున్న ఆ నదులు ఒక నర్తకి మంజీరనిక్వణ ధ్వనులను వారి మనసులకు దెచ్చినవి. ఇప్పుడు వారు మానవసంచారానికి అనుకూలమైన ఇసుక నేలలో ప్రవేశించినారు. ఆ ఊసరక్షేత్రమంలో నెమ్మంతా ఆవిపోయి, ఎండి బీటలు వారి మానవావాసానికి దుష్కరమై యున్నది. ఈ కవిపుంగవుడు ఒక అంతర్హాసంతో, విభిన్నములు అసదృశములు అయిన రెండు మానసికతత్త్వాలతో దానిని పోల్చి చెపుతున్నాడు: ఒకటి-పరమ సత్యాన్వేషకుల స్వచ్ఛ మానసము, రెండవది-గణికాస్వభావము. ఈ రెంటికి పోలిక ఎక్కడంటే సత్యాన్వేషకులు తమ కఠోరాన్వేషణ దీక్షాపాలనంలో రాగరస కవోష్ణతను విడనాడి అధిగమించి ముక్తసంగు లగుచున్నారు; ఇక తమ రూపయౌవనాలపై బ్రతికే వేశ్యలు తమ ప్రణయరసాన్ని అమ్మకానికిబెట్టి కాముకునికి అర్పించి, ప్రేమానుభవానికి దూరులై దాని స్పర్శే లేకుండా జేసుకొంటున్నారు. ఇట్లా కవి తన చతుర వచోరచనచే రెండు భిన్న మూలప్రకృతులను జాణతనంతో అనుసంధించి విస్మయాన్ని కలిగిస్తున్నాడు.

అట్టి నిర్మానుష్య భయదరంగంలో, విశ్వామిత్రుడు రామునికి తాటక అనే రాక్షసి అమానుష క్రూరచేష్టలను వర్ణించి చెప్పను ప్రారంభించినాడు.

విశ్వామిత్రుడు, "అదిగో! అది ఆ దూరపుకొండమీద నివసిస్తుంటుంది" అని చెప్పీ చెప్పకముందే- నల్లటి పెద్ద దేహంతో ఎర్రచిర్ర వెంట్రుకలతో ఒక స్త్రీ బయటకు వచ్చినది. మండుతున్న ఒక కరుదువ్వకొండవలె ఆమె ఉన్నది! ఆమె కనుబొమల చివరలు కోపంతో ప్రకంపించిపోతున్నవి. వాలిన పెద్ద పెదవులతో కొండచరియలాంటి తన నోరును మూసిపెట్టినది. ఒకదాని తొండములో ఇంకొకదాని తొండమును కలిపి కట్టిన ఏనుగుజతల పెద్ద పేరును మెడలో వేసుకొని ఉన్నది. ఉన్నట్లుండి ఒక బెట్టిదపు పెడబొబ్బపెట్టినది; దానితో, గగనతలము జగదంతరాళము సప్తలోకాలు అదిరి వణకి తారుమారైపోయినవి. ఈ పిడుగు ఉరుముల మ్రోతకు భయంతో ప్రళయాంతక పర్జన్యగర్జనమే అణిగి నీరవమైపోయినది.

కవి ఆ రాకాసి ప్రచండశక్తిని పాటగా ఇట్లా సూచిస్తున్నాడు :

తెలియాడెడు మబ్బుల జవిరిపట్టి
        నుగ్గునూచముగాగ నమలి మ్రింగె,
పెద్దకొండల కాల్దన్ని నురుముచేసె,
        లేత నెలరేని కూచిమొనల డాలుగల తనదు
భయద భూరి దంష్ట్రలను నొక్కి
        పెను వాతెరను బిట్టుగరచె,
క్రూర త్రిశూలమ్మున్ చేతబట్టి త్రిప్పి
        "ఇదిగో! మీ రొమ్ములనాటి చీల్చివైతు"
నని బెట్టిదంపు రొదబెట్టి ఏచి నిలిచె!

ఇక రాముడు కార్యోన్ముఖుడు కావలసిన తరుణమదేనని విశ్వామిత్రుడు భావించి, ఇట్లా సవినయంగా అర్థించినాడు :

"ఓ రఘుకుల భూషణా,
        ఈపె ఇలగల పాపసంఘాలనెల్ల
కొరవలేకుండా పూర్తి చేసినది,
        ఇక చూపిన నిగ్రహమంతా
మనలను నమలి మ్రింగకుండుటే!
        అదిగూడా, భయకంపంతో మన శరీరాలు
కృశించి కుదించుకొనిపోయి ఉన్నవని
        భావించి భక్ష్యయోగ్యం కావనే
మనలను వదలిపెట్టినది.

ఈ ఘోర పిశాచిని ఒక అబలగా భావిస్తున్నావా?
అందులోను-దువ్వి ముడిచిన ధమ్మిల్లము విప్పుపై
నాట్యమాడ ఒయ్యారి నడకలనడచే కుసుమ పేశల
గాత్ర అయిన కన్యకారత్న మనుకొన్నావా ఏమి రామా?"

దవానలంవలె మండుతున్న ఆ రక్కసి, ఆ మహర్షి రామునితో డిన గుసగుసలేమిటో ఊహించుకొన్నది. తన కంఠమునుండి నాలుకలుచాచి

పూచే తెల్లనిప్పులను, తన పుమ్మెనవాలు గ్రక్కిన ఎఱ్ఱనిప్పులతో గలిపి వారిపై విసరికొట్టినది. మరణవృక్షమునుండే విరచి విసరిన భూరిశాఖవలె అది సరభసంగా వారిపైకి వచ్చినది. అప్పుడు—

రాముడు బాణము తాకిన
తీరు చూచినవారు లేరు;
భయద సుందర కార్ముకము
వంచగా చూచినవారు లేరు,
కాని, అచట ఉన్నవారంతా
ఆ భీషణ త్రిశూలము
తునియలై తుమురై నేలవాలుటను
మాత్రం వీక్షించినారు!

అంతట, కటికచీకట్ల ముద్దవంటి మేనివన్నెగల ఆ పడతి, మున్నీటి లోతులన్నిటిని పూడ్చివేయగలిగినట్లు పాషాణవర్షాన్ని శబ్దవేగంతో గురిపించి నది. ఆ రాలవాన రామకోదండ నిర్ముక్త శరాసారంతో అణగి వెలిసిపోయి నది. వెంటనే రాముడు నిష్ఠుర దుష్టవాక్యంవలె ఒక నిశాత తీక్ష్ణబాణమును పంపినాడు; అది కొండనెత్తమువంటి ఆ రక్కసి ఎదనుజొచ్చి, సత్పురుషుడు కాపురుషునికి చెప్పిన హితోక్తివలె గుండెదూసి బయటబడినది. దాని హృదయ రంధ్రంగుండా చిమ్మిన నెత్తురు ఆ సికతాతలాన్నంతా ఎఱ్ఱటి బురదగా చేసి నది. అప్పుడు అస్తమిత సూర్యభగవానుని సంధ్యారాగమంతా మిన్నువదలి మన్నుజేరినదేమో అనిపించినది.

రాక్షసజాతి రుధిరానికై దగగొట్టి వరటకపోతూ కాచుకొనియుండిన మృత్యుదేవత, రాముని ఈ కన్నె కయ్యంలో, ముందున్న నెత్తురు విందు వాచవిగా చప్పరించి పెదవులు తుడుచుకొన్నది.

## మహాబలి

తాటక సంహారానంతరం, విశ్వామిత్రుడు తన ప్రాపుననున్న రామ లక్ష్మణులను ఆ ఎడారి దాటించి, చెట్టుచేమలతో కన్నులపండువైన కొండగళ

మాగాణంలోనికి నడిచినాడు. ఆ సౌభాగ్యదేశం ఎవరిదని రాముడడిగినాడు. ఈ పట్టున విశ్వామిత్రుని నోట, రసవత్తరమైన ఒక చిన్న కథను చెప్పించే దానికి కంబునికి మంచి అవకాశం దొరికినది :

ఒకానొకప్పుడు ఈ దేశాన్ని భుజబలసంపన్నుడైన మహాబలి అనే రాజు పాలిస్తుండినాడు. నిజశక్తిప్రభావంతో ఆయన స్వర్గభూతలాలు రెండింటిని తన వీలుబడిక్రిందకు దెచ్చుకొన్నాడు. ఇంకా తన ప్రాభవప్రతిష్ఠలను పెంచుకోను దేవతలకే అలవిగాని ఒక మహాయాగాన్ని చేయసంకల్పించు కొన్నాడు. దీనికిగా తన రాజ్యపాలనను వివేకవంతులైన పుణ్యపురుషులకు అప్పగించి, మహాసవనానికి ఉపక్రమించినాడు. ఈ మనసంకల్పాన్ని తెలుసు కొన్న దేవతాగణము, దీనితో మహాబలి ఇంకా బలవత్తరుడగునన్న భీతితో మహావిష్ణువుదగ్గరకు పోయి, ఈ యాగోద్యోగాన్ని విఘ్నం చేయమని అర్థించినారు. విష్ణుదేవుడు సంతోషంతో వెంటనే అనుగ్రహించినాడు.

ఆ జగత్ సృష్టికర్త ఒక మరుగుజ్జురూపంలో అవతరించినాడు. ఒక సూక్ష్మబీజంలో దిగ్వ్యాపకమైన ఒక మహావటము దాగియున్నట్లే ఈ అనంత విశ్వం ఈ వామనమూర్తిలో ఇమిడిపోయినది.

ఈ ఖర్వుడు సర్వకళలలోను సమస్త విజ్ఞానంలోను ప్రావీణ్యంపొంది నాడు. ధ్యాననిష్ఠ ఆయన వపు కాంతిని ఉద్దీపింపజేసినది. పవిత్ర యజ్ఞోప వీతం ధరించి, అభిచార మంత్రాలను ఉచ్ఛరిస్తూ, గనగన మండే నిప్పు కణికలను అరచేతబెట్టుకొని ఈ వామనాకారుడు బలిచక్రవర్తి ఆస్థానానికి పోయినాడు. రాజు సముచితమర్యాదలతో ఎదురువచ్చి తీసుకొనిపోయి పూజించి, ఈ రాకచే తాను ధన్యుడైనట్లు భావించి తృప్తిజెందినాడు.

రాజు, వామనుని ఏమి కావాలనో కోరుకోమన్నాడు. నీవద్ద ఉంటే మూడడుగులనేల ఇమ్మన్నాడు మరుగుజ్జు. సరే తీసుకోమన్నాడు రాజు. ఇది వినగానే దానవ కులగురువు—మంత్రిశేఖరుడు—శుక్రుడు ఈ దానం చేయ వలదని వాదించి :

"దానవేశ్వరా, జాగ్రత్త! ఇది కపట వేషము; ఇత డెవరో ఉత్త మరుగుజ్జని భావించబోకు. ఒకప్పుడు ఈ బ్రహ్మాండ గోళాలను, వాటి అవలి సర్వ జగత్తును మ్రింగి పొట్టలో బెట్టుకొనిన అతడే ఇతడు" అన్నాడు.

"గురూత్తమా, అట్టి మహావిష్ణువే దీనుడై అర్థించి చేయి చాపగా ఇవ్వ గలిగిన నా భాగ్యము, నా చేతుల సుకృతము ఎట్టిదో భావించు" అన్నాడు– అర్థించినవారికి అరమర లేకుండా ఉదారంగా ఇవ్వడమే వ్రతంగా గలిగిన ఆ నెరదాత.

ఇక్కడ మహాకవి కంబుడు, అసదృశము ఆహ్లాదకరమును అయిన– లలిత రచనా వైభవం గల యీ మాటలను – మహాబలినోట పలికిస్తున్నాడు:

ఈ లోకంలో చచ్చినవారు చచ్చినవారు కారు,
 చావకనే దీనులై చేతులు చాచి
తిరిప మెత్తువారే నిజంగా చచ్చినవారు!
 మిత్రమా, ఇచ్చినవారు గాక
ఇక బ్రతికినవా రెవరో చెప్పు?
 దాతలు మృతులయ్యూ నిత్యజీవులు.

ఈ మాటలతో మహాబలి తన అమాత్యుని మాటను త్రోసి పుచ్చుతూ, వామనుని మూడడుగుల నేలను కొలిచి తీసుకోమన్నాడు. ఆ దానధార ఆ చిన్న చేతులపై పడగానే ఆ అప్రమేయస్వామి తడిసిన ఆ చేతులను చాచినాడు! వెంటనే ఆ గిడ్డ అంతకంతకు పెరిగిపో జొచ్చినాడు.

అక్కడ మూగి చూస్తుండిన జనమంతా, ఆ వామనాకృతి ఎదిగి సాధారణ మానవ శరీర పరిమాణం పొందినంతవరకు ఆశ్చర్యపడి ప్రశంస్తుండినారు; ఆ తర్వాత ఆ మహాకాయం పెరిగి పెరిగి ఆకాశాలంటి, వాటిని అధిగమించి, ఆపైన వ్యోమానికంతా ప్రాకిపోగానే ఆ ప్రజలే భయవిహ్వలురై పోయినారు.

ఊనినపాద మింతై మరి ఇంతింతై
 భూమండలమెల్ల చుట్టుకొనియె,
విశాల పృథివీస్థలి ఎల్ల
 ఒక చిన్న చుక్కవలె దోచె;

ఎత్తిన ఆ కాలు
ఊర్ధ్వలోకాలెల్ల మించి ప్రాకి
అచట సుంతైన చోటు లేమి
పెరుగుదల మాని, వెనుదిరిగి భువినిజేరె!

ఇక్కడ విశ్వామిత్రుడు ఈ కథ పరమార్థాన్ని రామునికి ఇట్లా నచ్చ జెప్పినాడు: చోటులేక తిరిగి వచ్చిన ఆ స్వామిపాదం నేరుగా బలిచక్రవర్తి మస్తకంపైన వ్రాలినది. దీనితో ఆ రాజు అహంకారమంతా తుడిచివేయ బడినది; తోడనే ఆయన కాయమంతా మూలభూతమైన మహత్తులో లీనమై పోయినది.

కంబుని కళా రసికత కథాంతానికి ఒక లలిత రమణీయతన కల్పించేదాక తృప్తిపడదు. అందుచేత దేవదేవుడా విష్ణువు మహాబలిని తనలో లీనం చేసుకొని, అతని రాజ్యాన్ని దేవతలకు పంచిపెట్టి, విశ్రాంతి దీసుకోను తన పాలకడలి నెలవుకు తిరిగి పోయినాడని ముగిసున్నాడు.

ఆ నల్లనయ్య విశ్రమింప
పాల మున్నీరు జేరినాడు!
స్వామి సహధర్మచారిణి రమాదేవి
ఆయన పాదము లల్లన తాకినది;
జగములెల్ల వలగొనగా కర్కశమైన
ఆ చరణయుగళి ఆ తల్లి చల్లని
స్పర్శచేత తరుణీకపోలాలవలె
లజ్జాచకితమై
అరుణ కాంతిని బొంది అతిశయించె!

ఇట్టి కోమల రచనా విధానంతో గాఢప్రేమోన్మత్తతతో కంబ మహాకవి, అనంతశక్తి – అనంత సౌకుమార్యముల సమ్మోళనముల విరోధముల సమన్వయ పరచి కృతకృత్యుడౌతున్నాడు.

## రాముడు ప్రేమపాశంలో బడినాడు

ఈ విధంగా కథలువింటూ, రాముడు లక్ష్మణుడు విశ్వామిత్రుని వెంట మిథిలా నగరం చేరబోతున్నారు; ఇక్కడనే సీతారాముల వివాహం జరుగ బోతున్నది.

వాల్మీకి రామాయణంలో, పెండ్లిపందిలిలో దప్ప అంతకు ముందు ఈ వధూవరులు ఒకరి కొకరికి చూపులు లేవు. వాల్మీకి సీత, అనసూయతో తన వైవాహిక కథను చెపుతూ, పెండ్లినాటికి తనకు ఆరేండ్ల ప్రాయమని గూడ చెప్పుతున్నది. కాబట్టి ఆ చిట్టితనంలో ప్రణయలీలలకుగూడ అవకాశం చాలా తక్కువ.

దీనికి భిన్నంగా, అసాధారణ కవితా శిల్ప సౌందర్యంతో ఒప్పారే ఒక శృంగార రంగాన్ని కంబకవి ప్రవేశపెట్టినాడు. దీనితో పాణిగ్రహణానికి ముందు – ధనుర్భంగానికి గూడ ముందుగా ఎప్పుడో ఆజాయాపతులు వలపుచూపులు చూచుకొని, ప్రేమించి ప్రేమింపబడే ప్రాయంలో బడినట్లు, ఇద్దరి ప్రాణాలు కలిసి ఒకటైనట్లు కల్పించినాడు.

సీత అలౌకిక ఉదాత్త రూప లావణ్యాలను వర్ణించేపట్టున, కంబరు తన సౌందర్య కళాజ్ఞానాన్నంతా అత్యంత విరళంగా దొర్లించినాడు. కంబుని ఊహ ప్రకారం, సీత జననానికి ముందే సౌందర్యాధిదేవత పరిపూర్ణత్వాన్ని పొందినది; ఎప్పుడో ఎక్కడనో ఏ స్త్రీమూర్తిత్వాన్నో పొందవలసిన సౌందర్యము తానే, ఇప్పుడే సీత శరీరరూపాన్ని పొందినది. యుగయుగాలుగా సృష్టిలో పేరుకొని యున్న అనంత సౌందర్య కళల నుండి అసంఖ్యాక రూపాంశాలను గ్రహించి, జీర్ణించుకొని సౌందర్యాధిదేవత క్రమక్రమంగా మూర్తిమంతమైనది. ఇట్లా చారుతలో గల సూక్ష్మతరాంశాలన్నిటిని స్వీకరించి జీర్ణించుకొన్నందుననే, సౌందర్యదేవతకు ఇక గ్రహింద గలిగినది ఏమీలేక తన సారు పొలిమేరలంటగా పరిణామాన్ని మాని నిలుకడైపోయినది. కాని, ఆశ్చర్యము! సీత జన్మించగానే సౌందర్యత ఒక నవనవోన్మేషతను మనోజ్ఞతను పొంది, లావణ్యరాశియై మునుపటి కంటె ఎక్కుడు కాంతితో ప్రదీప్తమైనది.

రాముడు, విశ్వామిత్ర లక్ష్మణులతో గూడ మిథిలానగర వీధులు గుండా నడచిపోతున్నాడు. రాచనగరు దరియగానే దాని ప్రక్కననే ఉన్న కందకం నీటిలో ప్రతిబింబించిన సీత చారువపు కాంతిరేఖను రాముడు చూచినాడు. ఆయన ఆ ప్రతిరూపం నుండి చూపులు మరలించగానే, ప్రత్యక్షంగా రాజహర్మ్యపువలభిపై (ముంజూరులో) నిలబడి సీత కనబడినది.

ఆ ఇద్దరు జీవుల అప్రత్యక్ష ప్రణయసూక్ష్మసంబంధాన్ని కంబకవి ఇట్లా హృదయాకర్షకంగా వర్ణిస్తున్నాడు :—

ఒకరి కనుదోయి ఇంకొకరి
కనుదోయిని గ్రహించినది,
వెంటనే ఒకదాని నొకటి మింగివేసినది.
ఇరువురి మనోధర్మాలు గతిమాని
స్తంభించిపోయినవి.
రాకుమారుడు రాకుమారిని చూస్తూ
అట్లే నిలిచిపోయినాడు;
ఆమె ఆయనను చూస్తూ నిశ్చలమూర్తి
అయినది !

నడకలో వెనుకబడియుండిన విశ్వామిత్ర లక్ష్మణులు ఆ సమయానికే రాముని దరిసినారు. రాముడు ఆ ఆనంద తన్మయత నుండి మేల్కాంచి, ఇష్టంలేకనే వా రిద్దరివెంట జనకమహారాజు రాజమందిరానికి పోయినాడు. సీత చేతము, ఆయత్తత, ఆమె సర్వసమ్మోహన గుణాలు రాముని చుట్టూ తారికాడి, రాముని మూర్తిని వెన్నాడి చనినవి. సీతయొక్క ఆత్మసర్వ సారమై దృష్టికి లగ్నమైయుండిన రాముని విగ్రహం మరుగైపోగానే, ఆమె మానసం లక్ష్యరహితంగా ఆ వేగంతో తేలియాడిపోజొచ్చినది.

శీతల చంద్రోదయంతో, రామునిపై విరహంవల్ల సీత శరీరతాపం ఎదిగిపోజొచ్చినది. శైత్యోపచారంగా శయ్యమీద పరచిన చల్లటి తామర లతో బాటు ఆమె శరీరంగూడ కమలిపోయినది. మెయి నలదిన చందన గంధము ప్రవరూపాగ్నివలె ఆమెను దహించినది. ఇట్టి మధురావేదనను కల్పించిన కంబుడు, సీత మనసులో దూరి మాటల మధ్య – "కామజ్వర నివారణకు ఏదైనా ఓషధి ఉండగలదా?" అని పలికిస్తున్నాడు.

ఈ సందున ఆ మూర్తిత్రయం జనకమహారాజు రాజ ప్రాసాదం చేరినది. వెంటనే రామునికి పైమిద్దెమీద పంచలో విడిది ఏర్పరుపబడినది. విశ్వామిత్రుడు లక్ష్మణుడు, రాముని ఒంటరిగాజేసి తాము క్రిందిగదిలో సర్దు కొన్నారు. ప్రేమ భావాలకు రాముడు కొత్త. సీతయందు లగ్నమానను డైనందున పరిపరి పోకడలకు మనసు పాల్పడుచుండగా, చీకట్లు దట్టంగా

చుట్టూ ముసుకొనిపోయినవి. ఆ గాఢ తమసం రాముని మధుర చింతనలకు తీవ్రతను కల్పించినది. ఇంతలోనే పొడిచివస్తున్న వెన్నెలరేడు ఆయన స్థితిని మరింత పాడుచేసినాడు. ఈ వేదనలోబడి నలుగుతున్నది ఆయన ఒక్కడేనా? కాదంటున్నాడు-కంబరు. వివిక్తత-ధ్వాంతము-తారానాథుడు-ఆయన వ్యథాకులితచిత్తము - సీత, వీ రందరూ ఆ విరహ నిశీథినిలో ఆయనచుట్టూ మూగి తోడై ఉన్నవి. రాముని విలాపం ఇట్లుండినది :

యుద్ధ రథాకారం దాల్చియున్న
　　ఆమె కటి ప్రదేశము,
శాత శరాలముల విసరుతున్న
　　ఆమె విశాల నేత్రాలు, మొనదేలిన చనుదోయి,
ఓహ్! ఆ అంతర్గత మందహాసము!
దయాశూన్యుడైన సమవర్తికి
　　ఇంతటి పరికర సన్నాహం కావాలనా?

ఈ పరితాపభావాలతో రాముడు చెలిమిచేస్తూ, తుదముట్టింపరాని ఆ దీర్ఘయామినిని గడిపి, అలసి సొలసి నిదురబోయినాడు. వాల్మీకివలె గాక కంబుడు రాముని దేవుడుగా వర్ణిస్తున్నాడు; అందువల్ల రాముడు అనుభవిస్తున్న మర్త్యయాతనల పట్ల కంబకవి మానసం చలితమైపోయినది. అందుచేత ప్రణయవ్యథాజర్జరిత హృదయుడైన రాముడు, కంబునిచేత అనుగ్రహ పూర్ణమైన భగవంతుని వత్సలతను ప్రకటింపజేయిస్తున్నాడు. ఆ దేవదేవుడు, మానవునిపై గల కరుణాతిశయంతో భూతలానికి దిగివచ్చి, దేశకాల పరిచ్ఛిన్నతను పొంది, మనుజ శరీరుల యాతనామయ జీవితానికి పాత్రమై, మానవాళికి విమోచనం కలిగిస్తుంటాడని ఈ మహాకవి చెపుతూ, వేగులో రాముని నిదురలేపను ఈ వైతాళిక కీర్తి గీతాన్ని గానం చేస్తున్నాడు :—

వెలుగురు చక్రాల తేరుపై పయనించి
　　సూర్యుడు చెమట ముద్దయినాడు.
అంతట పశ్చిమ వారాశి జేరి అందు మునిగి
　　మార్గాయాసం దీర్చుకొని, చల్లబడి

నూతనోత్సాహాన్ని పొంది
పూర్వాకాశాన ఉదయించి,
తన అరుణ రంజిత తరుణ
కిరణ హస్తాలతో
రాముని పాదాలను తాకి నిదురలేపినాడు !

అంత—

రాముడు అంతము లేని
యాతనా పూర్ణ కాళరాత్రిని
దాటి పారము చేరినాడు.
అనంత పాథోధిలో
దేదీప్యమాన సహస్రజ్యోతులమధ్య
తన మది కెక్కిన విశాల శయ్యపై
శయనించగలిగిన ఆనంద స్వరూపుడు
దేశకాల పరిచ్ఛిన్నుడై
ఇప్పుడు ఈ సంకుచితశయ్యపై
పవళింప నభిలషించి
ఇట్లు మానసిక శారీరిక బాధలతో
నలిగి నవసి దొర్లాడినాడు !

ఈ రసవత్తర ఖండమును మూల తమిళంలో చదువుచున్నప్పుడు పాఠకుని మనస్సులో అనంతకోటి మహార్ణవాల కల్లోల ఘోష వినబడుతుంటుంది. ఒక దివ్యశక్తిచే ప్రభావితమైన సంగీతము ఈ కావ్యమందంతటా ప్లావితమై యున్నందున, లయబద్ధ మధురనాదము సదా వినిపించుచునే యుండును. ఇక ఆ సంగీత రసావేశమును నిరంతర మనుభవించే చదువరి, కార్య కారణరూపమైన బంధమునుండి క్రమంగా జారి విడబడిపోతున్నట్లు ఒక అనుభూతిని పొందుతున్నాడు.

## ధనుర్భంగము

మిథిల దేశాధీశుడైన జనక మహారాజు శివ మహా ధనుస్సును తన ఇంటబెట్టుకొని కాపాడుచుండినాడు. ఆ భూరి శరాసనంయొక్క రెండు

గనయములను వంచి గొనయము బిగించగలిగిన బాహుబలభూషితునికే తన కుమార్తె-సీతనిచ్చి పరిణయం చేస్తానని జనకుడు ఒక ప్రతిన బూని యుండి నాడు. ఇంతవరకు ఎందరో భుజబల సంపన్నులు పరాక్రమవంతులు-రాజులు ఆ విల్లును వంచి నారెను సంధించలేక పోయినారు.

ఇప్పుడు, విశ్వామిత్ర ఋషి రాముని జనకునికి పరిచయంచేసి, ఆయన ధనుర్విద్యా ప్రావీణ్యమును వర్ణించి, తన పోషణక్రిందనున్న రాముని, ఆ భూరికార్ముకమునకు శింజినీబంధము చేయ అవకాశమివ్వమని జనకునికి సూచించినాడు.

జనకమహారాజు రాముని ఎగాదిగా చూచి, తర్వాత ఆ అరవరాని విల్లును పరకాయించి చూచినాడు; చూచి, హతోత్సాహియై తోడనే శంకాకుల చిత్తుడైనాడు. అట్టి దారుణ ప్రతినబట్టిన తన తొందరపాటుకు తన్ను తాను నిందించుకొని, తన సీత భవిష్యత్తును ఊహించుకొనగా జనకుని చిత్తము వ్యాకులముతో నిండిపోయినది.

కాని, విశ్వామిత్రుడు అర్థపుష్టిగల చూపుతో రాముని చూచినాడు:

వెంటనే లేచినాడు రాముడు!
పోసిన ఆజ్యాన్ని అందుకోను
యాగాగ్ని కుండమునుండి పైకి ఎగబ్రాకిన
జ్వాలా జిహ్వలవలె లేచినాడు!
దేవగణము-"అదిగో! విరిగె హరధనువ"ని
హర్షధ్వానముల చేసినారు
సంయమీంద్రులు దీవనల బలికినారు.
మేరు మహీధరమువలె ఆ మహా శరాసనము
అడ్డంగా పడియున్నది.
రాముడు దానిని దరిసి ప్రయత్నమే చేయనట్లు,
సీత మెడను కైసేయ ఏరికట్టిన
ఉల్లసిత కుసుమధామము నెత్తినట్లు
అవలీలగా ఎత్తినాడు!
అనిమిషులై చూచుచుండిరి
ప్రేక్షక గణములెల్ల,
కాని, ఒక్కడుగూడ రాముడా చాపమును

కాలదన్నుటనుగాని, నేర్పుతో అల్లె త్రాటిని
గూర్చుటనుగాని గాంచరైరి.
విల్లు నెత్తుట చూచిరేగాని
విరుచుట వారి కంటబడదయ్యె!
ఇంతలో అది తునియలై క్రిందబడిన
శబ్దం మాత్రమే వారి చెవులబడినది!

## సంశయ నివారణము

అభ్యంత మందిరంలో ఉండిన సీతకు, రాముడు ధనుర్భంగం గావించిన సంగతి పొలుకువయే తెలియదు. కాని, తన్ను ప్రేమహతిచే గాయపరచిన ఆ అపరిచిత బాలకుని సుందరమూర్తి సీత మానసఫలకంమీద గట్టిగా చెక్కబడి ఉన్నది.

కామార్తయైన సీత తూలితూలి, రామునికై ఉవ్విళ్ళూరుచుండగా, నీలమాల అనే ప్రియదూతిక వేవేగ సీత దగ్గరకు అదరుపాటున ఒక మెరపు తీగవలె పరుగెత్తిపోయినది. అప్పుడు, ఆ చేటిక హారకుండలమణులు ఇంద్ర చాపపు వన్నె లీనినవి. ఆ తొందరపాటులో ఆమె సిగవీడి, కట్టుచీర చెదరి దాడీ చేసినట్లు ఆమెను వెన్నాడినవి. ఆనందాతిశయంతో ఆమె తన్ను తానే మరచిపోయి ఉన్నది. తన దేవేరికి మ్రొక్కులిడకనే ఆడుతూ పాడుతూ కేకలు వేస్తూ ఆ శుభవార్త చెప్పనే మరచిపోయినది.

సీత :—"నీ మనసును నింపిన ఆ ఆనందమేమిటో చెప్పవే" అని నీలమాలను అడిగినది. దీనితోగూడ ఆ సంక్షుభిత దాసి చెదరిన తన శక్తులన్నిటిని కూడగట్టుకొని, సీతకు ప్రణమిల్లి- "అమ్మా, ఎవరో రాముడట, రాకుమారుడట, అంతటి శివధనుస్సును ఒక ఆటబొమ్మవలె ఎత్తి విరిచి పారవేసినారు" అని చెప్పి, నెమ్మదిగా-"ఆ నీరజాక్షుడు అయోధ్యాపురీశుడు దశరథుని కుమారుడు; ఆయనతోగూడ ఆయన తమ్ముడు, విశ్వామిత్ర మహర్షి వచ్చినారు" అన్నది. తోడవచ్చిన ఇద్దరి సంగతి వినగానే సీత సంశయాలన్నీ పటాపంచలైపోయినవి. విల్లు విరచిన వీరుడు ఎవరో కాదు-తన మనసులో దొంగగా దూరిన ఆ నోము పండేనని, సీత ఇప్పుడు తన మనసును బాగా కుదటపరచుకొన్నది. ఈ దృఢవిశ్వాసం వెంటనే ఆమె దేహంలో

పెద్ద మార్పు దెచ్చినది; కనక మేఖలాబద్ధమై యుండిన కౌను పెరిగినది; దీనితోగూడ ఆ మొలనూలు రెండై నేలబడినది. భూకంపన గ్రహణ యంత్ర సూచికాశక్తి గలిగిన కంబుని మానసం ఇక్కడ సీతమ్మ శరీరంలో పుట్టిన సూక్ష్మాతి సూక్ష్మ ప్రకంపనాన్ని రహస్యచలనాన్ని గూడ వర్ణించగలుగు తున్నది.

## పెండ్లి పిలుపు

సీతను ఈ తియ్యటి కోర్కెల విందులో విడనాడి, కంబరు పాఠకుని జనకుని సమక్షానికి తీసుకొని పోతున్నాడు. అక్కడ, ఆ ధనుర్భంగ మహా ర్భటికంటె ప్రచండతరమైన ఆనందసాగర ఘోషలో జనకుడు కుత్తుకల బంటి మునిగి ఉన్నాడు. "పెండ్లి ఇప్పుడే జరిపించవచ్చునా? లేక దశరథుడు వచ్చిన తర్వాతనా?" రాజు ఆత్రంతో కౌశిక మునిని అడిగినాడు. ఆ ఋషి పుంగవుని ఆదేశానుసారం దశరథునికి వివాహ ఆహ్వానం పంపినాడు.

## వైవాహికోత్సాహం

దశరథ మహారాజు నిజపరివార సమేతంగా మిథిలాపట్టణ గమిడి చేరినాడు. జనకుడు సబంధుపుత్రంగా ఎదురేగి, ఉచిత మర్యాదలతో వారిని నగరములోనికి తీసుకొనివచ్చినాడు. పెండ్లికొడుకు వీటి ఊరేగింపుకు వాడ వాడలలో సన్నాహం చేసినారు. రాముని నగలు పూవులతో కైసేచి, రథంలో కూర్చుంపబెట్టి ఆనంద కోలాహలంతో నగరోత్సవం చేసినారు.

ఆ ఊరేగింపు కల్యాణమండపపు మొగసాల చేరినది. అప్పటికే మునీంద్రులిద్దరు–వసిష్ఠ విశ్వామిత్రులు వైవాహిక సభలో కనిపెట్టుకొని ఉన్నారు. రాముడు ఆ శుభమందిరం ప్రవేశించి, ఆ యిద్దరు సాధుశ్రేష్ఠుల పాదముల కెరగినాడు. అప్పుడు రాముడు, ఒక వజ్రహారమును ధరించి ఉన్నాడు. ఆయన అట్లా సాష్టాంగపడినప్పుడు ఆ రత్నాలపేరు అల్లలనాడి, ఆయన శ్యామసుందర గాత్రంమీద దాని క్షణప్రభలను పరపి ధగద్ధగితం చేసినది. వర్ణభేదాలను వర్ణించడం ఈ కవికి మహా ప్రీతి! వర్ణిస్తున్నాడు:– ఆ ఋషుల పాదతలమున రాముడు వంగినప్పుడు–విద్యుల్లతా భాసురమైన ఒక ప్రావృట్కాల మేఘం మెల్లిగా దిగి వస్తున్నదట!

శబల వర్ణ పదప్రయోగంచేతను, ప్రస్ఫుట కాంతిమంతమైన ఊహా పరికల్పనలచేతను, అవసరమైన స్వల్ప తమాంశాలను గూడ పోనీయక వర్ణించి, కంబకవి మన కన్నుల ముందునిలుపునది ఒక స్థిరకాంతి చిత్రం గాదు–చలనచిత్రమూ గాదు–అంతకుముందే సహజ ప్రకృతి వర్ణచిత్రమూ కాదు! పొడవు వరపు లోతుగల త్రిపరిమాణాత్మకమైన ఒక నాటకదృశ్యాన్నే సృష్టించి మన కన్నెదుట నిలబెట్టుతున్నాడు.

## ప్రణయినుల సమాగమం

వచ్చిన బంధుకోటి అంతా పేరోలగం తీరి ఉన్నారు. వసిష్ఠుడు జనకునితో పెండ్లికూతురును ఇక పిలిపించమన్నాడు. సీత సుందర మందగమనంతో మండపస్థలికి నడిచివస్తున్నది. ఆమె ధరించిన భూషణావళి నటన మాడే వివిధ వర్ణబింబాలను నేలమీద బరపినవి. అసమ కర్కశభూమిపై అడుగిడినచో సీత పేశల పాదాలు నొప్పునోయన్న భీతితో భూమాత శబల వర్ణ శోభిత పుష్పదళాలతో ఆ తలమునంతా మెత్తటి రత్నకంబళివలె పరచి పెట్టినది.

నాటకీయ కళారమ్యమైన కొన్ని గంభీర వాక్యరచనలతో, సమావేశమైయున్న ప్రధాన అతిథులు, జానకీ దర్శనమాత్రాన పొందిన హావభావములను మాత్రం వర్ణించి, వారి వ్యక్తిత్వాలను రూప విభవాలను కన్నులకు గట్టినట్టు కవి వర్ణించిన తీరు ఇది :

మధుర సంగీత కలనాదసదృశమై ఒప్పారే ఆ దివ్య వధువు సమీపించేకొలది సభాస్థారులంతా అభినందనపూర్వకంగా చేతులెత్తి విజయగీతములతో కీర్తించినారు. ఇందు రాముడు ఋషులుమాత్రం పాల్గొనలేదు; దీనికి కవి సమాధానం చెపుతున్నాడు: అంతఃకరణమున్న ప్రతి వస్తువు సీతను దివ్యాంశంగా భావించినది; అందువల్ల మనసు అనుకొన్నదానిని వెంటనే శరీరం నిర్వర్తిస్తుంటుంది.

నీలమాల రామునిగూర్చి చేసిన అభివర్ణనమే చాలియుండి స్థిరపరస్తుండగా, ఆ ధర్మ నిర్మథనుడు రాముడు అవునో కాదో అన్న సంశయం సీత మనసులో ఇంకా నెక్కొనే ఉండినది; ఎందుకంటే–ఆమె ఆయనను తేరిపార చూచినచో వినీతతాభంగమై యుండును. అప్పుడు కంకణ సంస్కారమిషతో

చటాలున దొంగ క్రీగంటిచూపును ఆయనపై ప్రసరింపజేసినది: అప్పుడు తన మనసులో భావించుకొంటుండిన ఆ రాముడు, ఇప్పుడు ప్రత్యక్షంగా ఎదుటనే కనబడుచున్న ఈ రామునితో ప్రతి అంశములోను సరిపోయినాడు. దీనితో ఇక ఇప్పుడు మనసును నిలబలుకుకొన్నది. ఆయనపై చూపు వాల్చిన ఆ కనురెప్పపాటులోనే, రాముని దేహశ్యామల కాంతిపూరము సీత విశాల నేత్రాలలో ఒక స్రవంతివలె వెల్లువబెట్టినది.

ఆ సమయంలో, దశరథుని కోర్కెమీద సీతారాముల పాణిగ్రహణ మహోత్సవం రేపు జరుగుతుందని ప్రకటించినారు.

## భోగయోగముల సంయోగము :

మరుసటి రేపకడ వైవాహిక విధులు జరిపేదానికి కావలసిన సంభారములన్నిటిని సమకూర్చుకొని, కులబ్రాహ్మణుడు – వసిష్ఠుడు సిద్ధంగా ఉన్నాడు.

చక్కగా పూలతో శింగారింపబడిన పెండ్లికూతురు పెండ్లికొడుకు వచ్చి పెండ్లి తిన్నెపై కూర్చుండినారు. సీతారాములిద్దరు ప్రక్కప్రక్కన ఒరసుకొని కూర్చుండగా, కంబకవి–అప్పుడు ఆ ఇద్దరు భోగయోగములయొక్క అద్భుత సంయోగంవలె నున్నారని మనతో గుసగుసలాడుతున్నాడు. భూతలానందానికి స్వర్గసుఖానికి మధ్య సహజసిద్ధమైన ఎట్టి అసంగతగాని లేదని, ఆ రెంటిని ఒకే సామరస్యరూపంగా కలిపివేయవచ్చునని కవి దృఢవిశ్వాసం.

ఈ పెండ్లి పూర్తికావడంతో గూడ విశ్వామిత్రుని పనిగూడ పూర్తి అయిపోయినవి. కథారంగంనుండి ఆయన నిష్క్రమణాన్ని, కంబుడు ఒక అపూర్వగీతంతో జరుపుతున్నాడు. ఈ స్తుతి సంపూర్ణ సంగీత కళాస్ఫూర్తితో వెలువడి, విశ్వామిత్రుని కృతకృత్యతను, ఆయన ఉత్కర్షను అభినుతించి, వీడ్కోలును సహజ సౌభాగ్యంతో చెపుతున్నది :

ప్రభుధీరుడైన ఆ వరుడు–
జనకుని ప్రియతమమైన ఆ కోకిల పడంతి
అనుక్షణ భిన్న ఆనందరీతుల
క్రీడించుచుండగా,

విశ్వామిత్రుడు వేదోక్తంగా వారిపై
దీవనల నింపి,
ఆ సువర్ణ మేరువు ఉత్తుంగ శిఖరాన
నిజాశ్రమం చేరను
ఉత్తరాభిముఖుడై పయనించినాడు!

ఇట్లు విశ్వామిత్రుని వర్ణనమును దగ్గరిచూపుతో ప్రదర్శించి– ఈ మహా ఇతిహాసంలో గురుతరప్రభావం ప్రాముఖ్యంగల ఒక ఐక్యతను సమకూర్చిన ఆ మహాభాగుని కవి సాగనంపుతున్నాడు.

# 3

# అయోధ్యాకాండము

ఇప్పుడు ఈ మహానాటకంలో, అయోధ్యాకాండ రంగమున యవనిక ఎత్తబడు చున్నది. దశరథుని చిన్నభార్య కైకేయి, ఆమె దాసి–కుబ్జమంథర కుతంత్రాల వల్ల పట్టాభిషేక భంగమైనది. రాముని అరణ్యాలకు నిర్వాస సంపుటతోడనే రావణుడు సీతాపహరణం గావించేదానికి సన్నివేశం సమ కూర్చబడినది. ఈ చెరబట్టుచే చివరకు రాక్షస కుల వినాశనానికి – అధర్మము, ప్రజాపీడనముల నిర్మూలనానికి బీజావాపమైనది.

కంబరు ఈ కాండను ఒక దీర్ఘప్రార్థన గీతంతో ప్రారంభిస్తున్నాడు. ఈ భాషలో గల అత్యుత్తమ గీతములతో సరిపోల్చదగిన సర్వ విషయ శోభిత గీత మిది.

ఆకాశము నుండి ఆవిర్భవించిన
ఈ విశాల పాంచ భౌతిక పదార్థ సమితి
ఎల్ల భువనము లందు వ్యాపించియుండును.

ఆత్మ - జ్ఞానములు రెండును
మాంసరూపమైన ఈ దేహమున నిండి
బయటగూడ పరచుకొని యున్నట్లే,
సర్వేశ్వరుడు ఈ మహా విశ్వమున ఉండి
దానికి అతీతుడై యుండును.
ఆ దేవదేవుడు ఎవరో గాదు!
ఆ యువ రాజాధిరాజు - ఆ వీర మంజీరధారి
రాముడే!
సవతితల్లి - రాణి కైకేయి చేతను
ఆ వృద్ధ కుబ్జదాసి చేతను
పరిభవింపబడి, అలయింపబడి
రాజ్యాధికారమును త్యజించి,
రాముడు వనముల వననిధులదాటి
దుష్టుల సంహరించి శిష్టుల దివ్యుల
పరిత్రాణము గావించినాడు!

నీరస అనువాదముల చేత ఈ పద్య మూలపాఠము చిందర వందర చేయబడి, యథార్థ రూపమును లయబద్ధ మనోహరతను పోగొట్టుకొన్నది. అయినప్పటికిన్నీ విజ్ఞానశాస్త్రభావమును, ఆధ్యాత్మికావేశంతో స్వర్గదర్శన సుఖానుభూతితో సంలీనం చేయగలిగిన కంబమహాకవి ప్రతిభా విశేషాన్ని కొంత ఈ మూలపద్యం మనకు రుచి చూపిస్తున్నది.

## మంత్రాలోచనము—

దశరథుడు మిథిలా నగరం నుండి తిరిగి వచ్చిన తర్వాత, అయోధ్యలో ఆనంద పూర్ణదినములు చాల గడపినాడు. సమర్థులు, నీతిపరులైన కుమారుల వివాహములతో ఆయన లౌకిక జీవితము ఐశ్వర్యముతో నిండి పరిపూర్ణమైనది. ఒకనాడు దశరథుడు అంతఃపురము వీడి, పట్టపు ఏనుగు నెక్కి మంత్రాంగ మందిరం చేరి మంత్రుల రావించినాడు. ప్రధాన మంత్రి అయిన వసిష్ఠుడు ముందుగా కొలువుకూటం చేరి ఉన్నాడు; మిగత మంత్రులు తమ తమ స్థాన గౌరవోచిత క్రమంతో సభను ప్రవేశించి, వసిష్ఠుని మ్రోల అవనతగాత్రులై, అవల దశరథుని ఎదుట ముకుళితహస్తులై

ప్రణామములు గావించినారు. వసిష్ఠుడు, రాజు పరామర్శింపగా వారు తమ తమ యథోచితస్థానములందు ఉపవిష్టులైనారు. దశరథుడు వారిని సాదరముగ చూచి ఇట్లనుచున్నాడు: "అకళంక మునీషులు మా పూర్వుల త్రోవ త్రొక్కవలెనని అభిలషిస్తున్నాను. వారు వార్ధక్యము రాగానే రాజ్యభారమును తమ పుత్రుల కొసంగి, ఆధ్యాత్మిక జ్ఞాన ప్రతిపత్తిని అన్వేషించను అడవులకు పోయెడివారు" అని.

ఈ సూచనపై యోచించి కార్యాచరణ విధానాన్ని సూచించమని మంత్రిమండలిని కోరినాడు.

రాజు మాటలను అత్యంత శ్రద్ధతో వింటుండిన కులహితుడు - వసిష్ఠుడు ఆ సూచనయందున్న వివేకమును ఇంగితమును గమనించి, సచివుల ఏకగ్రీవ అభిమతమును లోకహితమును తలచి పలుకుతున్నాడు:

"ఇది నిజంగా పవిత్ర ధర్మము
ఈ నిర్ణయము మీ వంశ గౌరవ ప్రతిష్ఠలకు
ఉచితమైనది."

తన యోచనలు ఇట్లా వసిష్ఠుల ఆమోదమును పొంది నందుకు దశరథుడు ఆనందాతిశయంతో పొంగిపోయినాడు. పెద్దల నొసలులు విరివియై, పెద్ద అక్షరాలతో వాటిపై అనుమతి వ్రాయబడి ఉండినట్లు కనుపించినది. దశరథుని కోరికపై సుమంత్రుడు రాముని ఆస్థానానికి దీసికొని వచ్చినాడు.

రాముడు వసిష్ఠుని పాదముల కెరగి, దశరథునికి అభివాదనము చేసినాడు. రాజు వాత్సల్యతన్మయుడై పుత్రుని బిగికౌగిటజేర్చి, ఆనందాశ్రువుల వెల్లిలో రాముని మూర్ధమును తడిపినాడు. తమ పూర్వవంశదీపకులు ప్రాయపు సంధ్యలో రాజమకుటముల పుత్రుల కందించి, తమ ఆత్మోన్నతికై అడవుల కేగిన సంప్రదాయమును వివరించి ఆనందించినాడు రాజు.

తండ్రి కోరిక విన్న ఆ అరవిందాక్షుడు - పుత్రుడు రాజ్యమును అపేక్షించలేదు, అవగణనమునూ చేయలేదు. రాకుమారునికి రాజ్యపాలము విధి అని గుర్తెరిగినాడు. "రాజాజ్ఞ నాకు శిరోధార్యమైన శాసనము" అని ఆత్మగతంగా అనుకొని, రాముడు ప్రభువు నాజ్ఞకు అంగీకరించినాడు.

దీనితోగూడ దశరథుడు రాముని పదేపదే గుచ్చిగుచ్చి కౌగలించుకొని, పరివారము మంత్రులు వెంట నడువ నిజాభ్యంతర మందిరం చేరినాడు.

నేల నాలుగు చెరగుల దేశదేశాల మన్నీడులకు, సార్వభౌములకు ఆహ్వాన పత్రములు సగౌరవంగా అంపబడినవి. అవి బంగారు రేకులమీద వ్రాయబడి, గరుడ ముద్ర వేయబడినవి.

## ఉత్సవోత్సాహ చకితమైన పురము :

రాముడు మకుట ధారణోత్సవానికి సజ్జీకృతుడౌతున్నాడు. అయోధ్యా పురవాసులు, మొదలే అందమైన ఆ పట్టణాన్ని ఇంకా అందంగా అలంకరించి నారు! దేదీప్యమానమైన సూర్యునికి మెరుగు ఎక్కించినట్లు, జగద్రక్షకుడు ఆ మహావిష్ణుని విశాల వక్షస్థల కౌస్తుభమణిని తుడిచి మెరుగుబెట్టినట్లు చేసినారు.

రథయూథము గజఘటలు వీథులంతా అనిపోయినవి. బంగారు నగలు దిగవేసిన మదపుటేనుగులు నగర మంటాపథాలలో నడుస్తున్నవి. వాటి నుదుటి ఫలకాలలో ఉదితభానుడు ప్రతిబింబిస్తుండగా, అవి ఉదయాచ లేంద్రాలవలె భాసించినవి.

ఇట్లా ఆ మహానగరం ఆనంద విస్ఫులింగదీప్తిలో పొంగారిపోతుం డగా, అనర్థహేతువైన ఆ గూని మంథర-రావణుడు చేసిన సర్వపాపముల స్వరూపమో అన్నట్లు రంగంలో ప్రవేశించినది. ఆ ఉత్సవానంద కోలా హలం మంథర ఈసును రేగగొట్టినది, దాని మనసు ప్రకంపించిపోయినది; అమర్షము ఆమె దేహమంతా వేళ్ళూని ప్రాకినది; హృదయం బాధాక్షుభిత మైనది; కండ్లు నిప్పుకణికలవలె మండినవి; ఆమె పలికే పలుకులు ఘూర్ణిత క్రోధంతో సలసల కాలిపోయినవి.

ముల్లోకాలను దుఃఖవారాశిలో ముంచివేయగలిగిన ఆ వృద్ధ దాసి, దశరథ మహారాజు మూడవ భార్య-భరతుని తల్లి కైకేయి అభ్యంతరమంది రంలో పిడుగుపాటువలె వ్రాలినది. గట్టిగా పెదవులు బిగించుకొని, చిన్న రాముడు మట్టి ఉండలను వింటితోతన గూనుపై గొట్టి ఎగతాళికిగా కారియ పెట్టిన పాత కథను మనసుకు దెచ్చుకొని, దానిని అందే నిలదొక్కుకొన్నది. తన రూపాన్ని అట్లా అవహేళనం చేసిన ఆ కొంటెపిల్లవాడు ఇప్పుడు ఇట్లా రాచసింగపు గద్దెనెక్కటం చూచి సహించలేకపోయినది. అందువల్ల, కైకేయి

సవతిబిడ్డకు జరుగనున్న పట్టాభిషేకాన్ని ఆమెచేతనే జరుగనీయకుండా చేయాలన్న కుటిలభావంతో మంథర, రాణిమందిరం ప్రవేశించినది.

## కంబకవి శిష్టాభిరుచి

ఈ ఇతిహాసంలో అన్ని పాత్రలనువలెనే కైకేయినిగూడ కంబ మహాకవి వాల్మీకికి కేవలం భిన్నమైన అచ్చులోనే పోతబోసినాడు. కైక ప్రేమాస్పద–దయాశీల–ఉదార–దానశీల–నిండు మనసుగల ఆమె, కలలో గూడ స్వపుత్రుడు భరతునిపట్ల, సపత్నీపుత్రుడు రామునిపట్ల భేదభావం చూపి ఎరుగదు. ఆమెయందు ఇట్టి సునిశిత సముచిత సంస్కారమును ప్రవేశపెట్టినందున, మాయావిని అయిన మంథర కుటిలప్రయోగాలకు కైకేయి లొంగకుండునట్లు, కంబరు మంచి కట్టుదిట్టలేర్పరచి ఉంచినాడు. దీనివల్ల తన నెత్తికే తానే పరిష్కార క్లిష్టసమస్యలను తెచ్చిపెట్టుకొన్నట్లయినది. అయితే నేమి? సూక్ష్మ గభీర మానసికస్థాయిలో ఈ చిక్కును తృప్తికరంగానే, కంబుడు విడదీయగలుగుచున్నాడు. అన్నెం పున్నెం ఎరుగని ఆ కైకేయి మనసును మంథర విరిచి విషపూరితంచేసిన ఈ ఘట్టం రసపూర్ణమైన ఒక మహా కావ్యమే! ఇట్టి రాణిని విశ్వాసఘాతకిగా చేసి, పాపానికి ఒడిగట్టుకొనేటట్లు చేసిన విధానాన్ని అంతా, ఇక్కడ స్థలాభావంచేత క్లుప్తంగా వర్ణించుకోవలసి ఉన్నది. కైతవకుశల ఆ మంథర, మానవహృదయ నికృష్టాపేక్షను గాక, మానవస్వభావ మహానుభావతను ఆధారంగా చేసికొని వాదించి నమ్మించి, కైకేయి విమల మానసాన్ని మార్చినదని చెప్పినచో మనకు ప్రస్తుతానికి చాలును.

మంథర అడుగుతున్నది:–"కౌసల్య కొడుకు ఏలిక కాగానే సర్వప్రపంచమూ ఆమెదగును. అప్పుడు అనాథలు దరిద్రులు పేదరికంతో నలిగి, ఆర్తి ప్రేరేపించగా దీనులై నీ పంచజేరి చేయిచాచి యాచించినవారిని ఆదుకోను నీ సవతిని భిక్షమడిగెదవా? లేక నావల్లకాదని వారిని తిరుగగొట్టి పంపెదవా? అంతేగాకుండా, ఆమె దయదలచి పెట్టిన భిక్షంతో జీవించదలచుకొన్నా? యోచించు."

ఈ పలువ పనికత్తె ఇట్లు పలుకగా, భవ్యమైన ఆ దేవేరి పవిత్ర మానసం ధర్మ వైముఖ్యమును పొందినది. ప్రపంచ సర్వపాప నివర్తికిగా

దేవతలు ఘోర తపమాచరించి పొందిన వరబలమువల్లనో అన్నట్లు కైకేయి బుద్ధిచెదిరి మారి వెతలబడినది. ఇక్కడ కవి ఉత్ప్రేక్షిస్తున్నాడు:

వెంటనే రాణి, తన కొడుకు భరతునికి రాజ్యం ఎట్లా చేజిక్కునో, ఆ ఉపాయం చెప్పమని మంథరను అడుగుతున్నది. దాసి వినయముట్టిపడ చేతులు జోడించి, తన దేహమెంత వక్రమో అంత వక్రమైన చిత్తంతో— శంబరాసురుని (సంవరాజ) జయించిన యుద్ధసమయంలో దశరథుడు ఆమెకు ఇచ్చిన రెండు వరాలసంగతి గమనం చేసినది. ఒక వరంతో తన కొడుకుకు రాజ్యం పొందవచ్చునని, రెండవదానితో రాముని పద్నాలుగేండ్లు అరణ్యానికి నిర్వాస మంపవచ్చునని సూచించినది. అది కైకేయి మనసులో బాగా నాటుకొనిపొయ్యేటట్లు చేసినది. కైకకు బాగా చురుకెక్కినది; ఈ పన్నాగాన్ని సాగించను వేగిరపాటు చూపినది.

ఈ కోర్కెలను వినగానే దశరథునికి తలపై పిడుగుపడినట్లయినది. రాముని అరణ్యానికి పంపమని బలవంతం చేయవద్దని భార్యను ఎంతో వేడుకొన్నాడు; కాని ఆమె పట్టు వీడలేదు.

ఆ సార్వభౌముడు దీనుడై క్రిందబడి దుమ్ములో దొర్లి ఆక్రందించి అర్థించినా చలించని ఆ దృఢమనస్క—కైక: "కోరిన వరము లిత్తువా సరి, లేకున్న రాజా, ఇదిగో ఇప్పుడే ప్రాణాలు తీసుకొంటా" అని పేర్చి పలికినది. లనుకొన్న మాటను కోర్కెను సాధించుకొని తీరుతుంది అన్న దృఢాభిప్రాయం రాజుకు బాగా తట్టినది; కోప సంక్షుభితమానసంతో అంటున్నాడు: "ఈ మహాపాపి నికృష్ట పతిత" అని అంటూ ఆవేశంతో—

"ఇచ్చినా, నీ వరాలిచ్చినా
నా బిడ్డ దుర్గమారణ్యాలనే ఏలగలడు;
ఇక నేను మరణించి
స్వర్గరాజ్యాన్ని ఏలగలను.
నీవూ నీ కొడుకు చావక
ఈ రాజ్యాన్ని నెత్తినగట్టుకొని ఏలుకొనండి!
కాని, అపకీర్తి మహోదధిని ఈది
మీ రెన్నటికీ దరిజేరలేరు?
దాటలేరు—లేరు?"

## కైక తృప్తితో నిదురబోయినది!

ఆ వృద్ధ నృపతి ఈ చరమవాక్యాలు పలికేటప్పుడు, సానలుబెట్టి పదునెక్కించిన ఒక కూచిబాకు గుండెను దూసినట్లు, నిర్భర శోకాహతితో స్పృహదప్పి నేలగూలినాడు. ఆ గయ్యాళిగరిత కరుగని ఆ గుండెలో సఫలీకృతభావతృప్తి ఒక దొంగవలె ప్రవేశించగా, వెంటనే శయ్యపైబడి నిదుర బోయినది. అత్యంత ప్రకోపితమైన మానసము, హఠాత్తుగా ఆక్షోభనుండి తప్పించుకొని బయటబడగానే, తోడనే క్రిందరుజారి, గాఢ నిద్రావస్థలో మునిగిపోతుంది-అన్నది మానసిక ప్రవృత్తిలో ఒక సూక్ష్మసత్యం. ఈ మహాకవి, ఈ వాస్తవికావస్థను ఒక హృదయంగమ ఫణితిలో వర్ణిస్తూ, దశరథునిని తీవ్ర వ్యథాకుంచిత సర్వేంద్రియ స్థంభనలోనికి పంపిన తర్వాత, కైకను శాంతిమయ నిద్రావస్థలోనికి ప్రవేశపెట్టుతున్నాడు.

## ప్రకృతి అసమ్మతిని తెలుపుచున్నది?

కైకేయి నిద్రలో శాంతిని అనుభవించినా, కంబుని ప్రకారం ప్రకృతి అంతా ఈ విద్రోహక క్రూరచర్యపట్ల తీవ్ర అసమ్మతిని తెలుపుచూ తిరుగబడుతున్నది.

ధ్వాంతనిశి ప్రత్యూషమైనది; పెండ్లినాడు మొదలు పెనిమిటి పంచప్రాణాలవలె వర్తించి, ఇప్పుడు ఆ నిజ ప్రియనాథుడు దుఃఖోపహతుడై యుండగా, కొంచెమైనా అనుకంపజూపని ఈ సిగ్గులేని ఇల్లాలు నడవడిని చూస్తూ, ఇక మానవాళికి తల ఎత్తి తన మొగమెట్లా చూపగలనని సిగ్గుపడి, శీతల రజనీకాంత గబగబా పరుగెత్తిపోయినది.

వేగుతోగూడ చుక్కలు ఆకాశంలో విలీనమై పోయినవి. రాముని మకుటధారణోత్సవానికిగా, నక్షత్ర ఖచిత విశాలాకాశం - ముత్యాలసరాలు వ్రేలాడగట్టబడి, వాటి లావణ్య కాంతిపూరంతో భూతలాన్నంతా ధావళ్య ప్లావితంచేసే, ఒక కకుభంత వ్యాప్త శృంగారవితానంవలె వెలుగొందినది. హసిత రాజీవలోచనుడు-ఆ రాముని పట్టాభిషేక విపర్యమైన ఈ దుఃఖతరుణంలో ఇంతటి మేలుకట్టుకు పని ఏమున్నది-అని కాబోలు, చుక్కలన్నీ రోదసీగర్భంలో ముడుచుకొనుచుండగా, రాముడు పట్టాభిషేక కంకణం ధరించే లోపలనే, ఆ గగనవితానమంతా త్వరత్వరగా విప్పి, చుట్టివేయబడుచుండినట్లు తోచినది.

సూర్యుడు అస్తమిస్తున్నాడు! దట్టమైన ఒక పొదవలె పరచుకొని వ్రేలాడు చుండిన ధ్వాంతశత్రువు కాలికి బుద్ధిచెప్పి పరుగెత్తినది. సూర్యవంశ సంజాతుడైన ఆ దశరథుని ప్రాణము, ఆ రాజప్రాసాద దీపావళి వలె వెల వెలబారి క్షీణించిపోతుండినది. విశ్వాసఘాతిని ఆ కైకేయి పాప భూయిష్ట దుష్కృతానికి కోపపడి, కండ్లు నిప్పులు చెరగుచుండ, ఆ మండుటేల్పు ప్రవేశిస్తున్నాడు.

## పట్టాభిషేకానికి వచ్చిన ప్రజ

రాచపడకటింటి పరివేదనలు తెలియని అయోధ్యా పురవాసులంతా రాముని రాజ్యాభిషేక మహోత్సవానికి కుతుకలబంటి కౌతుకంతో ఎదురు చూస్తున్నారు. ప్రతి స్త్రీ పురుషుడు తమ తమ పరిణతి అభిరుచి తత్త్వానుగుణంగా రానున్న పట్టాభిషేక వీక్షణ సుఖాన్ని భావించి అనుభ విస్తున్నారు. వయసు మీరిన వనితా జనం రాముని ఆసన్న ఉన్నతిని కౌసల్యాదేవి మాతృహృదయంతో నిరీక్షిస్తున్నారు. వచ్చిన ముని గణము వసిష్ఠునివలె ఉదాసీనమైన ఆత్మవికాసంతో భావించినారు. యువతీ జనము ఆ సంతోష సన్నివేశాన్ని సీత హృదయానందంతో మేళవించుకొన్నారు. ఇక సీత ఆనంద తన్మయతతో లక్ష్మీదేవి వలెనే భాసించినది. అలౌకిక భావాత్మకులైన వృద్ధపౌరులు దశరథుని వలె శాంతాత్ములైనారు.

రాజులు రాజకుమారులు భూమండలం నాలుగు చెరగుల నుండి వచ్చి అయోధ్యను జనాకీర్ణము చేసి, ఆ సీతాపతి కల్యాణమకుట ధారణోత్సవానికి వేచి ఉండినారు.

## నవ వికసిత పద్మము

ఉత్సవానికి వచ్చిన ప్రజలు మున్నీటి అలలవలె రొదబెట్టుతున్నారు. పట్టాభిషేక మందిరంలో వసిష్ఠుడు వేదోక్త కల్పాలను సాగిస్తూ, సుమంత్రుని దశరథుని వెంటనే సభకు తోడ్కొని రమ్మన్నాడు. నేరుగా సుమంత్రుడు దశరథుని మందిరానికి పోయి, అందు రాజు లేనందున కైక అంతఃపురానికి పోయినాడు. అక్కడ కైకేయి, రాముని తీసుకొని రమ్మని వచ్చిన సుమం త్రుని ఆజ్ఞాపించినది. వెంటనే రాముడు కైకముందుకు వచ్చి సాష్టాంగదండ

ప్రణామం చేసి నిలబడినాడు. కైక రామునితో చెపుతున్నది – "మహారాజా, నీ తమ్ముడు భరతుడు ఇప్పుడు రాజ్యాభిషిక్తుడై రాజ్యం చెయ్యాలని, నీవు అడవుల కేగి, అచట జటావల్కలధారివై మునిపల్లెలలో మునులతో గూడ నివసించి పుణ్య నదీ స్నానాలతో తపమాచరించాలని, ఇట్లా పద్నాలుగేండ్లు గడపి తిరిగి రావాలని శాసించినారు!"

అనుకంపాశూన్యమైన ఈ ఆజ్ఞకు రాముడు ఆనందించినాడు. ఈ పట్టున కవి వర్ణిస్తున్నాడు: ఈ క్రూరాదేశం వినేదానికి ముందు రాముని ముఖము నవ్యశోభతో ఆకర్ణణీయమైన ఒక రాజీవం వలె నుండి, ఇది వినగానే ఆ మోము నవవికసిత అరవింద దీప్తిని మించి ప్రకాశించినది. రాముడు పలుకుతున్నాడు:—

"తల్లీ! రాజాజ్ఞ అననేల?
నీ ఆజ్ఞ చాలదా నేను తలదాల్చను?
ఇదిగో! ఇపుడే నీ సెలవు దీసికొని
అడవుల కేగు చున్నాను."

తన తండ్రి అక్కడనే అభ్యంతర మందిరంలో ఉన్నాడని రామునికి తెలుసును. కాని, ఆయన వీడుకోలు తీసికోను అందు ప్రవేశింపకనే, ఆదిక్కు మొగమై అభివాదనం అర్పించి, మరల కైక పాదముల కెరగి, నిజ జనని కౌసల్య మందిరానికి బయలుదేరినాడు. సందర్భవశంగా ఈ సంగతి ప్రస్తావించుకోవలసి వస్తున్నది—వాల్మీకి రామాయణంలో అరణ్య వాసానికి బయలుదేరే దానికి ముందు, రాముడు తండ్రి కొలువు కోరగా, దశరథుడు రాముని పిలిపించుకొని ఇట్లనెను: "కైకేయి నన్ను వంచించి ఈ వరములు ఇచ్చేటట్లు చేసినది; కాబట్టి నీవు నా ఆజ్ఞను పాలింపక, అయోధ్యా రాజ్యాధిపత్యాన్ని వహించాల". ఈ ఆదేశం వాల్మీకి రాముని తండ్రిచే ఒక దీర్ఘ నీతిసూత్రోపదేశం చేసేటట్లు చేసినది. దానిలో–తల్లికి ఇచ్చిన బాసలు తప్ప వద్దని అర్థించినాడు. కంబకవి కావ్యశిల్ప దృష్టితో, కొన్ని గట్టి కారణాల వల్లనే ఈ వికృతపు వీడుకోలును వదలివేసినాడు. ఒకటి – దుఃఖ విదీర్ణ మానసుడైన జనకునితో చెప్పకుండానే రాముడు అడవుల కేగినప్పుడే ఆ వియోగ దుర్భర వేదనా స్వరూపం సాంద్రతరమై నాటకీయతను పొందు

తుంది. రెండవది – దశరథునికి పుత్రునిపై గల మమత, సత్యంపై గల ప్రేమ – ఈ రెండూ ఒక అసాధారణ సంఘర్షణలో పడి ఉన్నవి. ఒకదాని కంటె ఇంకొక దానిని పెద్దజేసిన ఎడల వాటికి గల సామరస్యం పాడై పోగలదు.

## ధర్మం ఆక్రందించినది

ఆ రాజ వనిత కౌసల్య
తన రాముడు – శ్యామలగిరి సమ చారు గంభీరంగా
శిరస్సు నలంకరించిన మకుట రత్న దీప్తులు
మిరుమిట్లు గొలుపుచుండ,
తన మ్రోల కరుదెంచునని
పొంపిరిబోయిన ఆమె మాతృహృదయం
నిరీక్షణానందంతో స్పందించుచుండ——
ఆ రఘుకుల దీపకుడు
వింజామరులు వీచువారు లేక,
రాజలాంఛన దవళాత పత్రం పట్టువారులేక,
నిర్దాక్షిణ్యక్రూర విధి ముందు నడువ
సముచిత ధర్మము డగ్గుత్తికతో
నిట్టూర్చుచు వెనుక నడువ
ఒంటరిగా తల్లి ఎదుటకు చేరినాడు!

అంత రాముడు ఓరిమితో స్థిమితంగా నిజ నిర్వాసోదంతమును చెప్పగా, విని కౌసల్య దుఃఖంతో కూలబడిపోయినది.

రాముడు శోకాకులమూర్తియై తల్లిని లేవనెత్తి, ఓదార్చను ప్రయత్నిస్తున్నాడు. సగము ఊరడిల్లిన ఆమె – "నిజంగా భరతునే రాజ్యాన్ని పాలించనీ. అతడు ధర్మగుణ పరిపూర్ణతా ధని. నీకంటె ఉత్తముడు గూడా. కాని, పరస్పోధితుడైన రాజు పాదముల కడబడి, నీకు ఆ కఠిన వనవాస క్లేశం తప్పింపమని మాత్రం దీనాతిదీనంగా వేడుకొందును." ఈ మాటలతో గూడ కౌసల్య, కైకేయి మందిరం తట్టు పరుగెత్తినది. అప్పుడు అక్కడ రాజు రా నేలపైబడి స్మృతితప్పి ఉండుటను ఆమె చూచినది.

ఈ సందుకట్లలో, వసిష్ఠముని బయట గుమిగూడి వేచియున్న ప్రజా సందోహానికి ఈ బెట్టిదపు వార్తను వినిపించినాడు. ప్రకోపిత మతిభ్రంశంలో పౌరులు కలుషాతి కలుషమైన ఉద్దేశాలను దశరథునికి అంటగట్టి, రాముని పట్టాభిషిక్తుని జేసి, రాజ్యత్యాగం చేస్తానని రాజు చెప్పిన దంతా ఒక పన్నాగమని చాటి జెప్పినారు. ఇంకా—

మేము రాముని పరివేష్టించి
ఆయనను అనుగమింతుము;
విషమయ భుజంగావృతమైన
భయదకాననంలో ఆయనతో నివసించి
ఆకారడవిని మనోజ్ఞ నగరంగా
మార్చివేస్తాం—

అని ప్రకటించినారు.

ఇట్లా పౌరులు తమ కట్టడి నొసటి వ్రాతను దూరి ఆక్రోశిస్తుండినారు.

ఇంతలో లక్ష్మణుడు, చారునేత్ర–నిజవిమాత–కైక మరులు గొల్పి మమతల్లి తండ్రి దశరథుని లొంగదీసుకొని, రాముని అడవులకంపి, తన సొంత కొడుకుకు రాజ్యం దక్కించుకొన్నదని తెలుసుకొన్నాడు. వెంటనే ఇట్లా సింహగర్జన చేసినాడు—

"ఇదిగో! నే నిక్కడ నిలబడి ఉన్నా!
యుద్ధం కోరే వారిని రూపుమాపి
భూదేవి భారం అపన ఇంతును.
మార్కొన్నవారి పీనుగులను దొంతులుగా పేర్చి
మింటి కప్పును తన్నించే దానికి
ఇదిగో! నే నిక్కడ సిద్ధంగా ఉన్నా!
నేను మన్నించి మాన్యపరచే ఒకే ఒక రాజు శిరముపై
కిరీటము బెట్టను సంసిద్ధుడను
ఎవరో ఆ మగబయిసి గలవారు రాండి;
వచ్చి నా కోర్కెల ధిక్కరించండి!

ఈ పలుకులు పలికే టప్పుడు సౌమిత్రి - అగ్నిని చండకిరణునితో మేదిపి చేసినట్లు క్రీడించినాడు. తోడనే రాముడు లక్ష్మణుని దరిసి, సౌమ్య స్నిగ్ధ తుషార శీతలములైన మాటలు చిలుకరించినాడు. ఆర్పరాని మంటలను తడిపి ఆర్పివేయవచ్చిన నీలి కారు మబ్బు వలె రాముడు కనుపడినాడని కవి ఉత్ప్రేక్షిస్తున్నాడు.

ఆ విధంగా లక్ష్మణ కోపాగ్నిని ఉపశమింపజేసి, రాముడు అరణ్యాగమనానికి ఆయత్తపడుతున్నాడు.

## రోదన ధ్వనులు

ఆ సంఘటనోగ్రత అయోధ్యలో ఇంటింటిపై దాడిచేసినది. దిగ్భ్రాంతులైన ఇల్లాండ్రు గృహకృత్యాలు చేయడం మానివేసినారు:

పొయ్యిలలో పొగరాజ లేదు;
గంధధూప సాంద్ర సువాసనలను
గృహోపరితలాలు పోగొట్టు కొన్నవి!
పెంపుడు చిలుకలకు
బంగారు పాలగిన్నెలు కరవైనవి.
ఊచే వనితా జన కరస్పర్శను
ఉయ్యేల తొట్లు ఎరుగనందున
శిశురోదనము ఎక్కువైనది.

ఇది ఒక మహోద్దాత్త నాటకము! మహిమోపేత వాఙ్మయము! వంట ఇల్లు-మిద్దె-పాలగిన్నె-ఉయ్యేలతొట్టి ప్రాణం వచ్చి తిరుగాడి మాట్లాడుతున్నవి.

అయోధ్యా పుర వీధు లెప్పుడూ ఆనందకోలాహలము, గాన సుస్వనాలతో ముఖరితమై ఉండేవి. ఇక ఇప్పుడో?

మృదంగ ధ్వనులు నీరవము లైపోయినవి!
వీణల తంత్రులు నిద్రబోయినవి;
పర్వదినోత్సాహ భరితులైన పౌరుల
కోలాహలము రుద్ధమైపోయినది;

రాజమార్గాలలో ఇప్పుడు
దుఃఖిత ప్రజా క్రందనాలు నిండి
అన్య మేదీ వినిపించుట లేదు.

వ్యథాకులిత చిత్తులైన పౌర జనసందోహము వెంట నడువ, రాముడు సీతమ్మ మందిరానికి పోయినాడు. అడవి బెట్టిదపు ఎండలకు తట్టుకోలేవని, సీతను తనవెంట రావలదని నచ్చజెప్పను ఆయన ఎంతో ప్రయత్నించినాడు. దానికి సీత పలికిన చురుకు మాట లివి :

ఆకానన భూరి దవానలం
మీ వియోగాగ్ని కంటె భీషణంగా
మండగలదా ?

రాముడు ఘూర్ణిత యోచనా ఆవర్తంలో చిక్కొనిపోయి ఉన్నాడు. సీత గబ గబ నిజాభ్యంతర మందిరం జొచ్చి, ఒక నారచీరను గట్టి బయటికి వచ్చి సాహసించి, రాముని సరసన నిలబడినది; నిలబడి ఆయన దీర్ఘ బాహువులను గట్టిగా పట్టుకొన్నది.

వాల్మీకి రామాయణంలో, సీత తనకు తానుగా తాపసి మొరటు గుడ్డలను ధరించదు; కాని, కైకేయి బలవంతాన వల్కధారణం చేయిస్తుంది. అప్పుడు ఆ వస్త్ర కాఠిన్యానికి సీత కలతనొంది, తన్ను బంధించుటకు పన్నిన వలను చూచి భయకంపిత అయిన తరుణ హరిణమువలె వణకి పోతుంది. వసిష్ఠుడు దశరథుడు, తమ రాతిగుండెవంటి గట్టి చీరలనిచ్చిన కైకను తిట్టి శపిస్తారు. కాని, ఈ ఓటిమాటలను కైకేయి పెడచెవిని బెట్టుతుంది. దీనికి భిన్నంగా కంబమహాకవి ఈ కర్కశ వస్త్రధారణమును సీత చేతనే – తనకు తానుగానే సంతోషంతో చేయిస్తున్నాడు. ఈ ధారణము, రాముని వెంట నిర్వాసం వెడలాలనే సీత నిశ్చయానికి నాటకీయమైన పరిపుష్టిని కల్పించినది.

## అరణ్య ప్రస్థానము

అది సూర్యాస్తమయ సమయము. సీతా లక్ష్మణులు వెంట నడువ, రాముడు అరణ్యాభిముఖుడై బయలుదేరినాడు. సుమంత్రుడు సారథియై వారి

ముగ్గురిని తేరుపై కూర్చుండబెట్టుకొని, రెండామడలు తోలుకొని పోయినాడు. ఒక సుగంధ పుష్పవాటికలో ఆరేయి విడిదికిగా దిగినారు. ఆ పూదోటలో రాముడు తాపసోత్తములతో సంభాషిస్తుండగా, వెంట వచ్చిన జనసందోహం ఒక ఆమడ వ్యాసంగల వృత్తాకారంలో, ఇసుకవేస్తే క్రింద రాలనట్లు దట్టంగా ఆనిపోయినది. అప్పుడు బయటి ప్రదేశమంతా పలువన్నెల రత్నకంబళం కప్పినట్లుండినది. వారంతా ఆ రాత్రి ఏటి ఇసుక తిన్నెలలో, పచ్చిక బయళ్ళలో, అనువైన ప్రతి బీటిపొలంలో విశ్రమించినారు.

క్రమేణా ఆ గుంపు సోలి, తూగులోనికి మునిగిపోతుండగా, వారికి తెలియకుండా రాముడు జారుకొని ముందుకు సాగిపో దలచుకొన్నాడు. పొయ్యేదానికి ముందు ఈ వీడ్కోలు మాటలు ఆ మంత్రితో చెప్పినాడు: "నీవు అయోధ్యకు మరలిపోయి, నా ముగ్గురు తల్లులకు నా వినయపూర్వక ప్రణామాలు అందజేయి. నీవు భరతుని ఎప్పుడూ కనిపెట్టుకొనే ఉండి, ఆ రాకుమారుని దుఃఖచ్ఛాయలు పారద్రోలు చుండుము." రాముడు తమ్ముని పై కురిపించిన ఈ అపరూప ఆశ్చర్యకర అనుకంపా రసానికి ఈ మహా కవి చకితుడై—

నిగమాది దివ్య గ్రంథములను వదలిపెట్టిన
దివ్యమూర్తి
దుర్గమారణ్య సీమల చేరి నిలచె!

అని సంభ్రమాశ్చర్యాలతో ఎలుగెత్తి చాటుతున్నాడు.

కేవల పరమార్థ శాస్త్ర విషయికమైన విద్య, పరమ గమ్యమైన సత్యానుభూతికి ఒక పెద్ద అవరోధమని కంబుని అభిప్రాయం. అట్టి విద్య మానవుని అహంకారమునే పెంచి దట్టముచేసి, మూలసత్యాన్ని అట్టి పండి తునికి దూరం చేస్తున్నది. మతతత్త్వ గ్రంథాలను మనం లోతుకు త్రవ్వే కొంది, అసత్య తత్త్వాన్ని గురించి మరింత సందేహ వ్యాకులిత మనస్కుల మగుచుందుము. కాబట్టే భగవంతుడు మానవ కల్యాణార్థంగా శాస్త్రగ్రంథ సంచయాన్ని విడనాడి, కానల కేగి తన సంపూర్ణ తత్త్వమును నిరూపించి, మానవాళికి విశ్వాసాన్ని కుదుటపరచవలె నని నిశ్చయించు కొన్నాడు.

అరణ్యావాస మెట్లు దేవుని అస్తిత్వమును నిరూపించి మానవునికి చెప్ప గలదు ?

పట్టణ కృతక స్వరూపంలో మానవుని చేతిపని దైవచేష్టితము కంటె ఎక్కువగా ప్రదర్శిత మగుచుండును. పట్టణాలలో తన హస్త నైపుణి – భావ విలసనము సాధించిన నిర్మాణాల స్ఫూర్తిని చూచుకొని మానవుడు అహంకార మదోన్మత్తుడై గర్వంతో తల ఊపుకొంటుండును. కాని, మానవుడు ఈ నగ రము వీడి, గిరికాననముల కేగి, అచటి గంభీర అంబర చుంబిత మహీజాలను చూచి వాటి శబల వర్ణశోభిత పత్రరాజిని వీక్షించి, కొండలనుండి దూకే నిర్ఝరాల ఆరణ్యకోత్సాహాన్ని తిలకించి – వాటి ఘనత్వాన్ని, తన లఘుత్వాన్ని భావించుకొని వినమ్రుడై కుంచిత మస్తకు డగుచున్నాడు. నిజ అహంకార హస్తచాతురి నిర్మించిన కృత్రిమరూపాలను ప్రకృతి గంభీర రూపాలతో – దృశ్యాలతో పోల్చిచూచుకొని, క్రిందైన తన వాటిని విస్మరించి, సర్వత్రా సర్వేశ్వరుని అగోచర సన్నిధానమును స్ఫురించుకొను చున్నాడు. ఇట్లే అరణ్య ప్రదేశ సందర్శనము, మానవుని మానసమును నిజాహంకారం నుండి దేవుని వైపుకు మరల్చు చుండును. కాబట్టే దేవుడు తర్కశాస్త్రగ్రంథ పుష్ఠముల నుండి తప్పించుకొని బయటపడి వనవాసానందానే అభిలషించు నని, కంబకవి చెప్పుట ఎంతగానో ఒప్పి ఉన్నది.

రాముడు – ఆ భగవదవతారము నగరం వీడి కీకారణ్యాల నడిబొడ్డు చేర నుంకించునప్పుడు ఈ మహోన్నత భావం ఈ మహాకవి మానస వీథిలో సంచరిస్తున్నది. భరతుని ఎల్లప్పుడు కనిపెట్టుకొని యుండమని సుమంత్రుని రాముడు అర్థించుట, సాధారణంగా మానవ స్వభావానికి అంటగట్టబడుతున్న సంకుచిత ఈర్ష్యాద్వేషాలకు దూరమై, మనకు హృదయా నందాన్ని కలిగిస్తున్నది. ఇదే కంబునిచేత "నిగమాది దివ్యగ్రంథములను వదలిపెట్టిన దివ్యమూర్తి దుర్గమారణ్యసీమల చేరి నిలచె" అన్న శాశ్వత స్మరణీయ మహావాక్యాన్ని పలికించినది. మరపురాని ఈ ఉత్కర్షమే రాముని దైవాంశ సంభూత స్థితిని, పాఠకుడు ప్రత్యక్షంగా గుర్తించగలుగు నట్లు చేస్తున్నది. ఈ వాక్యభాగాల ఉత్కర్షఅంతా అనురాగపూర్ణ ఆత్మజ్ఞాన శక్తివల్లనే ఉత్పన్నమగుతున్నది. ఇది బుద్ధి చాతుర్యము గాదు – కల్పనా పాటవము గాదు – కేవలము సహజ బుద్ధి ప్రభావం.

## శారికాకీరములు :

తర్వాత, సుమంత్రుడు సీతతట్టు తిరిగినాడు. అరణ్యంలో ఆనంద మయ భవిష్యత్తును అనుభవించేదానికి ఎదురుచూస్తున్నది – ఆమె. ఆమె సుమంత్రునితో అన్నది : "మొదట నా గౌరవాభివందనములు రాజుకు సమ ర్పించు; నా అత్తలకు మ్రొక్కెనని చెప్పు; అటు పిమ్మట అనురాగిణులైన నా తోడికోడంద్రతో నా ముద్దుల పిట్టలు–చిలుక గోరువంకలను జాగ్రత్తగా సాకమని చెప్పు". సరళ వినీత అమాయిక – దుఃఖఛాయల పొలుకువే ఎరుగని ఆ ముద్దరాలు – వనవాస క్లేశము దాని భయంకర ప్రమాదము లను ఊహించుకోలేని ఆ సీత శిశుహృదయ వాంఛను విని, సుమంత్రుడు జాలిగుండె బడినాడు. ఆమె లోకమెరుగని తనము కారుణ్యాన్ని పుట్టించగా దానినే తలచుకొని ఆయన వటవటపడి, కన్నీరు గార్చినాడు. సుమంత్రుని మనస్సు నొప్పించినానేమో అని, సీత దిగాలు పడినది. "నేను ఊరకే ఆ పక్షులను శ్రద్ధతో చూచుకోమన్నా–అంతేగదా! దానికిగా ఆయన కన్నీరు పెట్టవలసిన పని ఏమి?" అని ఆమె తలపోయ మొదలు పెట్టినది. ఆయన వగపు లోతుపాతులు ఊహించుకోలేక ఆమెగూడ ఏడ్వ ప్రారంభించినది.

దుఃఖభార కుంచిత హృదయంతో సుమంత్రుడు రాముని సెలవు దీసుకొని, ఒంటరిగా తిరుగు మొగమై అయోధ్యకు బయలుదేరినాడు.

## దేవతల దీపము

నిద్రలో మునిగియున్న పౌరగణాన్ని దిగవిడిచి, ఆసందున రాముడు అడవిలోనికి చొచ్చుకొనిపోను బయలుదేరినాడు. అప్పుడు అంతటా కాటుక చీకటి దట్టంగా పేరుకొనిపోయి ఉన్నది. ఆ అంధ తిమిరంలో రాముని వెంట ఎవరు పోతున్నారు? కవి వర్ణిస్తున్నాడు :—

సీత పతివ్రతాత్వము
        ధర్మవీరము
సంప్రీతుడైన తమ్ముడు
        విజయ కార్ముకము
రక్షక కవచంగా, వీడని తోడుగా నుండ

భూమిపై అవతరించిన ఆ దైవ విభూతి
ఆ రజనీ ధ్వాంతంలో ప్రవేశించినది!

ఆ ముగ్గురు తడుముకొంటూ ముందుకు సాగినారు. ఇట్లా నడుస్తుండగా గట్టి గోడ అడ్డంపెట్టినట్లు ఆ తమసం ఘనీభవించినది. పాపపు నేస్త గాండ్రు-రాక్షసులతో చెలిమిచేసి పొత్తు గలిపి, వారి ప్రీతికొరకు ఈ పావన త్రయ గమనానికి ఈ తిమిరావరోధాన్ని కల్పించినట్లుండినది. ఇట్టి నిగూఢ సూచనలతో కంబరు, ధర్మాధర్మముల మధ్య మున్ముందు జరుగనున్న దారుణ సమరాన్ని సూచిస్తున్నాడు.

వ్యోమమండలము దేవతల దీపమును
వెలిగించి తన చేతులతో ఎత్తిపట్టిన విధాన,
కజ్జలమగ్న నిబిడ ధ్వాంతమును
పటాపంచలుచేస్తూ,
వెన్నెలరేడు మింట ప్రవేశించినాడు!

ఇక్కడ కవి, మంచి నాటకుడనంతో ఆ కందెన చీకటిగుండా చదివే వాడినిగూడ ఆ యాత్రలో గలుపుచు, ఆ అధర్మ నిర్మూలన ధర్మయుద్ధ మును ముందుగా చూపిస్తున్నాడు. సమయానికి ఉదయిస్తున్న చంద్రుని దేవతల దీపము అనిచెప్పి, పాఠకునికి సద్యోజాత క్లేశోపశమనాన్ని కలిగించి, కృతజ్ఞతను వెలిబుచ్చునట్లు రచయిత చేస్తున్నాడు. ఈ పవిత్ర ఇతిహాస మంతటిలోను, శాశ్వత నియమము ధర్మము క్రమము శ్రేయము సదా మనస్మృతి పథానికి వస్తూనే ఉంటున్నవి.

నడిరేయిలో రేరేడు పొడుస్తున్నాడు. అప్పుడు ఆ వెన్నెలలో ఆ మూడు మూర్తుల ఛాయలు కదలిపోవుటను కవి వర్ణిస్తున్నాడు: రాముడు అంజన శైల సౌందర్యంతో నడుస్తున్నాడు; లక్ష్మణుడు బంగారు నీరుబోసిన కొండవలె అనుగమిస్తున్నాడు; నేలమీద వెన్నెల చల్లగా వ్రాలుతున్నది. సీత కుసుమ పేశల పాదాలు కర్కశవనభూమిపై నడచి కందిపోవునన్న భీతితో కటికనేలమీదంతా మెత్తటి తెల్లటి దూదిపింజలను చంద్రుడు పరచినాడేమో అనిపిస్తున్నది.

రామణీయకమైన ప్రకృతిశోభతో నిండిన ఆ పరిసరాలతో ఆ ముగ్గురు నిర్వాసితులను వదలి, సర్వసైన్యాధిపతి - సారథి - సచివుడు - సుమంత్రుసితోగూడ, కవి మనలనుగూడ నడిపించుకొనిపోయి, నిష్ఠుర విషయ గర్భితరంగమైయున్న అయోధ్యాపురిలో ప్రవేశపెడుతున్నాడు.

## అ శ్రు కూ ప ము

సుమంత్రుడు అయోధ్య చేరనాడు. ఆయనను చూడగానే దశరథుడు- "ఆ రాకుమారుడు దవ్వున నున్నాడా? దగ్గరగా నున్నాడా?" అని అడిగినాడు. "కీచకావృత దుర్గమారణ్యాలలో చాలాదూరానికి వెళ్ళినారు" అన్నాడు ఆ సారథి. "రాముడు వెళ్ళినాడు" అని మంత్రి చెప్పిచెప్పకముందే, అగ్గలికపు గోడునబడి, రాజు ప్రాణాలుగూడ వెడలిపోయినవి. దశరథుని దీనగాథ కంబుని నిలువెల్లా కుదిలించివేసినది. అహో! కవి ఎంతటి అశ్రుకూపమును త్రవ్వి కన్నీటి ఊటల జాలువారిస్తున్నాడు!

పతినిబాసి దుఃఖాంబుధిలో మునిగి, ధవుని కళేబరాన్ని చూట్టూపట్టియున్న ఆ అభాగ్యపత్నులను జూచి, కంబకవి మానసము, ఉజ్జ్వలకీర్తి మూర్తి అయిన దశరథుని చరిత్ర పైకిపోయి, గాఢయోచనామగ్నమై పోయినది. ఆయన అసువులొడ్డి ఇచ్చిన మాట నిలుపుకొన్నాడు; ఒక ఆదర్శసిద్ధికి ప్రాణాలు అర్పించి అమరజీవితాన్ని పొందినాడు. దశరథుడు పయనించిన ఆయన దేహతరణి ఐహిక జీవజడనిధిని భద్రంగా దాటించి, ఆయనను ఆనందపారం చేర్చినది. ఆ పడవ మాయ అనే సొరచేపల గుంపును తప్పించుకొని, శాశ్వత నిత్యత్వస్థితిలో సురక్షితంగా పథికజీవుని దింపి తిరిగివచ్చి, తన దీర్ఘయానార్హతను నిలబెట్టుకొన్నది. భర్తృమృతదేహాన్ని భార్యలు పట్టుకొని ఉన్నప్పుడు, ఆ దేహనౌకే తమ్ముగూడ అదే గమ్యానికి తప్పకా తీసికొని పోగలదన్న నమ్మకంతో దానిని వారు ఎక్కినట్లు వారి మోములందు ముద్రితమై యుండినది.

## వ న సం చా రం

అయోధ్యలో జరిగిన దుఃఖపరిణామాలు తెలియనందున, ఒక అకలుషితానందంతో సీతారాములు ఉల్లాసంగా అడవిలో నడచిపోతున్నారు. పర్వ

దినానందంతో ప్రకృత జరిపె మధుమాసమహోత్సవాన్ని వారు తిలకిస్తు న్నారు. బాధ్యతాభారకుంచితంగాని వారి తరుణచారు ఉల్లాసం ఆ వన భోజనయాత్రను విశిష్టంగా చేస్తున్నది. కంబుడు మనోజ్ఞము – కాంతిమంత మైన పద్యాలలో వర్ణించి ఈ విహారాన్ని సమున్నత స్థితికి గొనిపోతు న్నాడు. రాముడు సీతతోగూడ, విద్యుల్లతా శోభిత జలపూర్ణ మేఘంవలె విలాస పర్యటనం గావిస్తున్నాడు.

ఇప్పుడు వారు పావన గంగానది ఉత్తరతీరం చేరినారు. అక్కడ ముని పుంగవులతో ఇష్టాగోష్ఠి సలుపుచుండగా, విలుకాండ్రదొర – ఆ తీరవాసి – గుహుడు వచ్చి రామునికి వినతిజేసి నిలబడినాడు. అతడు వేయిపడవల ఎకిమీడు. భయద కోదండం అతనిచేత నున్నది. భుజాలు చక్రాలతో మలిచి నట్లున్నవి; ఊరువులు రక్తచందన దారువుతో జెక్కినట్లున్నవి; ఆ లోతు గంగను తల మున్కగాకుండా దిగి నడిచి దాటిపోగలిగినంత పొడగరి. ఎఱ్ఱతోలొకటి అతని మొలనుండి దిగజారిఉన్నది. ఒక పులితోక నడుము చుట్టు కాసెకోకగా బిగించబడి మెరుస్తున్నది. కోరలతో గట్టిన దండవలె సున్న ఒక గవ్వలపేరు అతని మెడలో వ్రేలాడుతున్నది. రాళ్ళపలుకులు తాకినట్లు అగపడే కాలి అందియలు రవళిస్తున్నవి. చీకటిపోసలు మెలిబెట్టి కట్టినట్లు న్నది – ఆ గుహుని శిగ. వరివెన్నులు సరంగా గూర్చినట్లున్న – అతని వెడద కనుబొమ్మలు కొదమసింగము కనుబొమలవలె నున్నవి. ఆ కిరాతుని పులితోకకాసెలో నెత్తురు మరకల బాకు చెక్కబడి ఉన్నది. విషముగ్రక్కె త్రాచువలె అతని ఆకృతి భీతినిగొల్పినా, మాటలు మధుర అవ్యక్త శిశుభాష ణాలవలె నున్నవి. అతడు, ఇంద్రుని వజ్రాయుధంవలె గట్టి నడుముగల వాడు; కల్లచదువులు నేరువనివాడు; మచ్చులేని మనసువాడు; తల్లికంటె ఎక్కువగా ప్రేమించేవాడు – ఆ గుహుడు రాముని మ్రోలనిలిచి, చేపలు పుట్టతేనెను కానుకబెట్టినాడు.

వాల్మీకి రామునివలెగాక, కంబుని రాముడు, ఆ అడవిమౌనులు శాకాహారులు. కాయగూరల తిండి సదాచారము – నీతేగాకుండా నాగరికతా లక్షణమనిగూడ కవిభావన. ఆ కిరాత ప్రభువు చేపలు తినమనడం వితాకు కలిగించడమేకాకుండా, చేరిఉన్న సాధువులకు అప్రియమై కోపమునుగూడ కలిగించినది. దరహాస వికసిత వదనంతో రాముడు:– "గుహుడు అర్పించిన

ఉపాయనములు ప్రేమరసస్నాతమైనందున పవిత్రీ భూతమైనవి; అందుచేత సుధకంటె రుచ్యములై అవశ్యభోజ్యములు" అని చెప్పినాడు. ఆమీదట; గుహుడు – రాజ్యసుఖమును వీడి వనక్లేశానికి ఎందుకిట్లా పాత్రీకరింపబడి నారని రాముని అడిగినాడు. లక్ష్మణుడు ఆ విషాదగాథనంతా క్రమంగా చెప్పినాడు. అది విని గుహుడు కన్నీరు బెట్టినాడు, గుహుని గాఢభక్తికి రాముడు ఆర్ద్రీభూత చేతస్కుడైనాడు; బోయను తమ్ముడుగా స్వీకరించి ఇట్లంటున్నాడు:

ఇంతవరకు మేము నలుగురు అన్నదమ్ములము!
ఇకమీరట కూరిమితో ఐదుగురైతిమి.
ప్రేమ సంఖ్యను పెంచుచుండును;
భ్రాతృత్వానికి పొలిమేర ఉన్నదా?

భ్రాతృత్వము జన్మతోగాక ప్రేమమీద అస్తిభారం ఏర్పరచుకొనుననని, కవి ఒక మనోహర భావాన్ని వెలిబుచ్చుచున్నాడు. ఈ ప్రేమ – ఈ అభిమానాలలో భ్రాతృభావం తన సీమల విస్తృతం చేసుకొంటూ పోతుంటుంది; ఈ రెండింటికి అంతరం అనేది లేదు.

గుహుడు సాగనంపగా, రేపకడనే ఆ ముగ్గురు వనచారులు చిత్రకూటాద్రి పాదతలము చేరినారు. ఆ పగలంతా వారు ఏటిగట్టున చెట్లనీడలో కాలంగడపినారు.

## ప్రేమ రస ప్లా వ న ము

వారట్లా ఒక కొండదొన నీటిదరిని కూర్చుండి యోచించుకొనుచుండగానే, ముని మాపై క్రమంగా బాగా చీకటిపడినది. ఈ లోపల లక్ష్మణుడు చక్కటి కొండ అంచున త్వరత్వరగా కట్టిన ఒక పర్ణశాలలో సీతారాముల ప్రవేశపెట్టినాడు.

లక్ష్మణుడు ఆ కుటీరాన్ని కట్టినతీరు: పంగల నిలువులనాటి, వాటిపైన అడ్డంగా గట్టి వెదురు బొంగులు అమర్చినాడు. నడుమ నిట్రాడులు ఎత్తి వాసాలుపరచి, పెంకెలను బిగించి అణగగట్టినాడు మొదట వెడల్పు టేకు ఆకులు పరచి దానిపై బోదగడ్డి కప్పినాడు. ప్రక్కల వెదురు దబ్బలు పేళ్లు నాటి, వాటికి బురదమట్టి మెత్తి వెల్లగొట్టినాడు. సీతారాములకు ఇదేవిధంగా

ఇంకొక ప్రత్యేక గదిని ఏర్పరచి, వాగువంకలలోని పలువన్నెల రాళ్లు ఏరి ఆ గోడపైన మట్టిలో తాపినాడు.

ఇదంతా లక్ష్మణుడు ఒక్కడే నిజరాజహస్తాలతోనే నిర్మించినాడు.

లక్ష్మణుడు ప్రీతితో సొంపుగా నిలిపిన ఆ పూరిల్లును అట్లా పరికించి చూచి రాముడు అలరిపోయినాడు. సీత లక్ష్మణుడు తనపై క్రుమ్మరించిన ప్రేమానురాగాలకు రాముడు ఆనందచకితుడై పోయినాడు. ఇటువంటి సహజ హృదయపూర్వక ప్రేమవిలసనము, ఉన్నదాన్నంతా పోగొట్టుకొన్నవారికే దక్కుతుందని ఆయన అభిప్రాయపడినాడు:—

జనకునికూతురు – మహారాణి
కుసుమకోమల చరణయుగళము
అరణ్యభూముల కర్కశ శిలాపథముల
త్రొక్కి నడచినవి;
నిరుపమానమైన నా తమ్ముని బాహులతలు
ఈ మౌనిజన నికేతనాన్ని కట్టినవి;
నిజసర్వస్వమును పోగొట్టుకొనినవానికి
ఈ ప్రపంచంలో ఏదికాదువ?''
అంతట రాముడు లక్ష్మణునివైపు దిరిగి—
"సోదరా, ఈ నిర్మాణ కౌశలమును
ఎప్పుడు ఎక్కడ నేర్చుకొన్నావు?''

అని పలికినాడు రాముడు. ఈ పేశలకమవాక్యాలు పలికేటప్పుడు ఆయన తామరసాక్షాలనుండి కన్నీరు పుంచుబొట్లవలె ఉరలినవి. ధర్మాన్ని నిలబెట్టినాడన్న పేరు తనకు తగదని రాముని భావన; ఎందుకంటే – ఆ ప్రతిష్ఠ అంతా తన త్యాగంమీదగాక లక్ష్మణుని నిస్వార్థ ప్రవర్తనమీదనే ఆధారపడి ఉన్నదని ఆయన లెక్క.

ఇట్టి పవిత్రీభూత దివ్యప్రేమానుభూతి వర్ణనమును చాలించి, కవి మనలను భరతుని దగ్గరకు కొనిపోతున్నాడు. భరతుడు, ఆయన మాతామహుడు – కేకయ మహీపాలుని చూడబోయి ఉన్నాడు.

## క్రూర శోకము

దశరథుని దగ్గర రెండు వరాలు గుంజుకొనిన కైక, హాయిగా నిదుర పోయి లేచినది. వెంటనే భరతుని తీసికొని రమ్మని దూతలను క్షణాలమీద కేకయ రాజ్యానికి పంపినది. భరతుడు ఈ సందేశాన్ని వినగానే త్వర త్వరగా అయోధ్యకు తిరిగివచ్చినాడు; కాని, ఆయన కింకా రాముని వన వాసము: తండ్రి స్వర్గవాసము తెలియనే తెలియవు.

ఆయన వచ్చేటప్పుడు అయోధ్యానగర వీధులన్నీ ప్రాణిసంచారం లేకుండా పాడుబడినట్లుండినవి. ఇవి ఏదో అశుభసూచకములనుకొని, రాజును చూడను రాజప్రాసాదం ఉత్కంఠతో ప్రవేశించినాడు. అందు రాజు లేడు; అందుండి క్షణంలో కైకేయి మందిరం చేరినాడు; చేరి, తల్లిని రాజు సంగతి అడిగినాడు. తల్లి తనయుని కౌగలించుకొని – "సంతాపం వలదు; నీతండ్రి స్వర్గవాసం చేరినాడు" అని చెప్పినది.

సిగ్గులేక వంతలేక తెంపరితనంలో చెప్పిన ఈ ప్రత్యుత్తరమును ఏమనుకొనవలెనో భరతునికి తెలియలేదు. తండ్రి మరణవార్త ఊపిరి ఆడ నీయనందున, భరతుడు చైతన్య విహీనుడైపోయినాడు. కాసేపటికి తెప్పరిల్లి లేచి తేరి మనసును చిక్కబట్టుకొని, పెద్దపెట్టున ఎన్నవలు బెట్టి ఏడ్చినాడు. మరుక్షణంలోనే ఆత్మ శాంతించగా, ఆయన మనసంతా రాముని పైకి పోయి నది. ఇది సహజమే గదా!

"ఆ రాముడు అంతము లేని ధర్మస్వరూపుడు. ఆయనే నా తల్లి – తండ్రి – ఏలిక. ఆయన పవిత్ర పాదాలను నా కన్నీట తడిపిననేగాని నా మానసము ఈ క్రూర శోకము నుండి బయటబడదు" అన్నాడు–భరతుడు. భరతుడు రాముని పట్ల చూపిన ఈ పూజ్యభావానికి కైకకు కోపం వచ్చి నది; పిడుగుల మ్రోతతో అంటున్నది

"భార్య, తమ్ముడు – ఆ ఇద్దరితో గూడ
ఇప్పు డతడు అరణ్యవాసి."

ఈ కటూక్తులు పలికిన తల్లి నిర్దాక్షిణ్యావిధము ఆ కొడుకు ఉల్లమును కలగుండు పరచినది. "ఇంకెన్ని కుట్రలున్నవి బయటబడను? నా చెవు

లను కాపియుపెట్టను ఇంకెన్ని దుఃఖోదంతా లున్నవి? రాజేల మరణించి నాడు? రాము డెందుకు అరణ్యములకు పోయినాడో చెప్పు" అని క్రూర కోపమున కాగి అడిగినాడు. కైక ఆవేశంతో – "ఒక వరంతో రాముని కానలకు నిర్వాస మంపినా, ఇంకొక దానితో ఈ రాజ్యాన్ని నీకు కూర్చినా! వీటిని భరించలేక నీ తండ్రి ప్రాణములు విడిచినాడు" అన్నది.

ఈ మాటలు బయటకు వచ్చేదానికి ముందు, తల్లికి ప్రణామంచేయను భరతుడు చేతులు పైకి ఎత్తి ఉండినాడు; ఆ మాటలు వినగానే ఇప్పుడు–

ఎత్తిన చేతులు దించి
మాటలు చొరకుండా వాటితో
చెవులు మూసుకొన్నాడు.
ఆయన కనుబొమలు పైకి క్రిందికి ప్రాకి
క్రూర తాండవం చేసినవి ;
కోపాగ్ని జ్వాలలు ఊర్పులతో గలసి
లోపలికి వెలుపలికి పరుగెత్తినవి ;
కండ్లలో నెత్తురు జొత్తిల్లి బయట కురికినది.

ఈ పాటలో క్రోధం కలిగించే శారీరిక లక్షణా లన్నిటిని వర్ణించి నాటకీయతను గూర్చినాడు. కోపవివిధాంగ వర్ణనను ఇంతటి ఉత్సాహంతో వర్ణించుట అరుదు. పేరాసతో రాముని కిరీటమును అపహరించడం భరతుని దృష్టిలో తీరని అపచారం. పాపపంకిల క్రూరచిత్త కైకేయిని నిలుచున్నట్టే నిలువున చంపకపోవడం గూడ అంతటి అపవిత్రచర్య అని ఆయన భావము. కాని, రాముని కోపానికి గురి అవుతానన్న భయంతో ఆ పలువ పలుకులు పలికిన నోటిని చిదురవేయక మానినాడు. నిరాశోపహతుడైన భరతుడు, కూటోపాయాలు పన్నే ఈ క్షుద్రజగత్తులో సుగుణరాశి అంతా కూలిపోయినదని అప్పుడనుకొన్నాడు. కాని, వగపు పొంగు చల్లారగానే, రామ దశరథుల మహాత్యాగాన్ని మనసుకు దెచ్చుకొని, ధర్మమునందు విశ్వాసము మరల కుదుటబడ ఉద్రిక్తుడై అంటున్నాడు :

ఇచ్చిన మాటను నిలుపుకోను
తన ప్రాణా లర్పించిన రాజు

ఎవరైనా ఉంటే—

దయా శూన్య వచన పాతంవల్ల

కఠిన నిర్వాస మనుభవించి

తిరిగి వచ్చిన మహానాయకుడు

ఎవరైనా ఉంటే—

అయాచితంగా లభించిన రాజ్యాన్ని

పాలించేదానికి ఒకభరతుడుంటే—

ఆ తప్పు సద్ధర్మానిది కాదు!

అది గ్రహచార దోషము.

ధర్మము కాంతి తరుగక

సదా వెలుగుచునే ఉండును!

జీవిత సర్వస్వము పరమోత్కృష్ట ధర్మసూత్రాల ప్రాపున పెరిగి మను చున్నదన్న భరతుని దృఢవిశ్వాసాన్ని కంబకవి అనన్య సాధారణమైన శక్తితో వైభవోపేతంగా వర్ణిస్తున్నాడు. ఈ మహాకవి పదప్రయోగ వైద గ్ధ్యము, వాటి శ్రుతి మధుర గుణము ఆనందోద్దీపకాలు. శబ్దార్థముల రెంటినీ మేళవించి రాణింపజేసే ఆయన కౌశలము అద్భుతము. కాబట్టే తమిళ కవు లందరిలోను కంబుని రచనలు అన్యభాషానువాదానికి కొరక రాని కొయ్య అవుతున్నవి. ఈ పాటలో భరతుడు తన్ను ప్రథమ పురుషలో చెప్పుకొని ప్రదర్శించిన ఉదాత్త గర్హణము, అతని పవిత్ర నామానికి సంద ర్భానుగుణంగా పాపి అన్న అర్థాన్ని ఇస్తున్నది. ఈ కవి ఇట్టి రామణీయక దశలను కల్పించి, తాను సృష్టించిన సజీవ పాత్రలు ఇట్టి వాక్పాటవం చూపుటచేత – పాఠకునికి ఆ ముఖ్య పాత్రలతో, ఆ సంఘటనలతో గల అనురాగపూర్ణ సన్నిహితత్వము తరుగకుండా సాగి వస్తూనే ఉన్నది.

భరతుడు, ఆ తల్లి ప్రక్కన నిలబడుటకే ఇష్టపడుట లేదు; ఎందు కంటే—ఆమె నికృష్ట పాపపంకిల అని, ఆమె మానసము మాటల కందని క్రౌర్యంతో నిండి ఉన్నదని భావించి, తక్షణమే భరతుడు కౌసల్య మందిరం చేరినాడు. ఆమె పాదాలపై బడి – "తల్లీ, పావన సూర్యవంశము భరతు డనే అపవాద కళంక దూషిత మైపోయినది. అతని కారణంగానే కలుష మానస – కైక రాముని కారడవులకు వెడల ద్రోలినది." అని, కన్నీట

తపనైన వాక్యాలు పలికినాడు. ఈ ఉదాత్తశోక వచనాలు విన్న క్షణంలోనే కౌసల్యకు, భరతునితో సారూప్యం పొందినట్లు అనిపించినది. రాజ్యత్యాగం చేసి, దుష్కరకాననవాసం ముగించుకొని వచ్చి తన కట్టెదుట నిలబడిన రాముని చూచినట్లే, ఆ దేవి గోడుగుడిచి కన్నీరు మున్నీరుగా ఏడ్చి, ఆ భరతుని జవిరి పట్టుకొని గట్టిగా కౌగలించు కొన్నది.

ఈ పట్టుననే వసిష్ఠుడు భరతుని దగ్గరకు వచ్చి – "మంచి రాజు లేని రాజ్యము దీప్త దినకరుడు లేని పగలు, రాకాశశి లేని రేయి వంటిది. మీ తండ్రి మరణించినాడు; మీ అన్న రాజకిరీటమును పరిత్యజించినాడు; మీ తల్లి కోరికపై అది నీ మూర్ధముపై వ్రాలి ఉన్నది. పుత్రా, ఈ రాజ్య పాలనాధికారమును గ్రహింపుము" అన్నాడు.

ఈ మాటలు వినగానే భరతుడు భయంతో నిలువెల్లా వణికిపోయి నాడు. వెంటనే తేరుకొని, జాజ్జ్వల్యమానమైన క్రోధంతో – "ధర్మదీక్షారతులకు, నీతిపరులకు ఇట్టి హితం చెప్పడం యోగ్యతేనా? ఇది ఎన్నటికీ జరుగదు. రాముని అడవుల నుండి తీసికొనివచ్చి, ప్రాచీన సముదాచారము ధర్మశాస్త్రముల ననుసరించి మా కులక్రమానీత కిరీటముతో ఆయననే పట్టాభిషిక్తుని చేయవలసి ఉన్నది. ఇంకొక మాట అన్నావా – ఆత్మహత్య చేసుకొందును" అన్నాడు. వసిష్ఠాదులు ఇది విని, భరతుని మహోన్నత న్యాయబుద్ధికి ఆశ్చర్యచకితులైనారు. రామునికి జరిగిన అన్యాయానికి భరతుడు ప్రతిక్రియ చేయాలని ఆతురుడై ఉన్నట్లు తెలుసు కొన్నారు. వెంటనే భరతుడు, తమ్ముడు శత్రుఘ్నుని రప్పించి – న్యాయసమ్మతమైన తమ రాజును మరల తమకే అప్పగింప భరతుడు కృత సంకల్పుడై ఉన్నాడని భేరి మ్రోతతో చాటించి ప్రజలందరికి తెలియజేయమన్నాడు.

దీనితో నిర్జీవమై యుండిన అయోధ్యా నగరం పునరుజ్జీవాన్ని పొందినది.

ప్రేమాపహరణంవల్లనే దుఃఖం పుట్టుతుందని, మహాభిషక్కు–కంబుని రోగనిదానము. ఆ వ్యాధి నివారణకు ప్రేమౌషధ సంసేవనమే తగిన చికిత్స అని, కవి చెప్పుతున్నాడు :—

భరతుడు, రథావళి–మాతంగతతి–అశ్వపంక్తులు–భటసమూహం వెంట కొలిచి రాగా, కాలినడకన తన అన్న రాముని దగ్గరకు బయలుదేరినాడు.

వాల్మీకి భరతుడు దీనికి భిన్నంగా, ఉత్కంఠతో ఒక రథమెక్కి మహా వేగంగా, అన్నను కలుసుకొని తిరిగి తీసుకొనిరాను పోతాడు.

ఇట్టి మహా సన్నాహంతో భరతుని సేనలు గంగాపగా తటం చేరినవి. ఆవలిగట్టున నున్న గుహుడు, ఈ సైన్యమంతా రామునికి వ్యతిరేకంగా ఎత్తి వస్తున్నదని క్షణంలో నిర్ధారణకు వచ్చినాడు.

కంబుని గుహుడు నియమ సూత్రాలకు కట్టుబడని భక్తి ప్రేమల అవరావతారము! ఒక శిశువుయొక్క అకలుషిత జ్ఞానము, ప్రతిబంధకము తెరుగని ప్రతిక్రియ స్వభావం – గుహుని గుణములని, కవి మన మనసులకు దెస్తున్నాడు. గుహునికి రామునిపై గల భక్తి విశ్వాసాలు విశృంఖలంగా ఉత్సాహోన్మాదంతో ప్రవర్తించకుండా కట్టుబాటు చేస్తున్నవి:—

ఖడ్గమొండు వీరకాసె నుండి వ్రేలాడ
        బొడుగరచి కన్నులు నిప్పుల చెరగ
కోసి గుచ్చి వెతబెట్టు పలుకులు క్రుమ్మరించి,
        రణభేరి మ్రోగించి, విజయ కాహళ మూది
తనకు తోడు నీడైన చుట్టాల పగిది
        అతని ఉత్తుంగ భుజాలు ఉరకను ఉబ్బుచుండ
నిలిచినాడు గుహుడు!

తన చుట్టు వీరుల చేరదీసుకొని వీరవచనాలు పలుకు తున్నాడు:—

ఈ ఉత్తుంగ కల్లోల కల్లోలిని
        దాట నుంకించి బ్రతికి బయట బడగలరె వీరు!
ఈ ఏనుగుల పెద్ద గుంపును చూడగానే
        పిరికిపందలై పరుగెత్తు విలుకాండ్రమా మనము?
రాముడు నన్ను కూరిమి తమ్ముడని
        నోరారా పిలువ లేదా?
ఇది మాటలలో ఆణి ముత్తెం కాదా?

భరతుని అయోగ్యత గుహుని ఎక్కువగా బాధించినది. తన యుద్ధ వీరులకు శౌర్యోద్దీపక వచనాలు ఇట్లా పలుకుతున్నాడు:–

తన రాజ్యాన్ని వారికి ధారబోసిన
నా ప్రభువు,
నా కాననరాజ్యమందుండుటకు గూడ
సహింపక ఎత్తివచ్చినాడు!

గుహుడు గంగ దక్షిణ తటాన నిలబడి ఉన్నాడు! ఉత్తరపు ఒడ్డున, మంత్రి సుమంత్రుడు భరతుని దరిసి, గుహుని గూర్చి చెప్పి, అతనికి రాముని పై గల భక్తిని వివరించినాడు. వెంటనే భరతుడు గుహుని కలుసుకోవాలన్న ఔత్సుక్యంతో సుమంత్రుని వెంటబెట్టుకొని నీటిదరి చేరినాడు. ఇప్పుడు ఆ కిరాతరాజు భరతుని బాగా చూడగలిగినాడు.

వల్కలములు దాల్చిన అతని శరీరము
ధూళి దూసరితమై ఉన్నది!
జిగిపోయి కిరణ హీనుడైన సుధాంశుని వలె
ఆయన ముఖ మండలం
హాసశూన్యమై ఉన్నది!
పండి పరిపక్వమై ఆయన శోకము
కారుణ్య దేవతా రూపంతో
కఠినతర పాషాణములను గూడ
కరగిస్తున్నది.
ఇట్టి దుఃఖ విశీర్ణమైన భరతుని
రూపాన్ని గుహుడు చూచినాడు!
చూచి, దిగ్భ్రమతో దగ్గుత్తికతో
ఎగరొప్పుతూ రాతిబొమ్మవలె
నిలబడిపోయినాడు.
వణకే చేతుల నుండి విల్లు జారి
నేలపైబడిపోయినది,

ఈదెబ్బకు తట్టుకొని తేరి గుహుడు ఇట్టి భరతుని ఉద్దేశము యుద్ధమయ్యే యుండదని తెలుసుకొన్నాడు. మరు క్షణంలోనే ఆశ్చర్యంతో అంటున్నాడు—

విశ్వాసపాత్రుడైన ఈ రాకుమారుడు
నా ప్రభువు మొక్కట్లతో ఉన్నాడు!
ఆయన ఒక ముని వినీత వేషమున ఉన్నాడు!
ఆయన దుఃఖానికి మేర గనిపించడం లేదు.
అదిగో! రాముని దిక్కు మొగమై
అభివాదనం చేస్తున్నాడు!
నా ప్రభువు సహోదరుడై పుట్టినవాడు
ఎన్నటికీ దురాచార దూషితుడు కాలేడు!

వెంటనే గుహుడు తనకు తానుగానే తెడ్డువేసుకొంటూ, ఒక పడవలో భరతుడున్న తీరం చేరి, ఆయనకు నమస్కరించినాడు. భరతుడు గుహునికి సాష్టాంగ దండప్రణామం చేసి నిలిచి – "మా తండ్రి దశరథుడు చేసిన అన్యాయాన్ని సరిజేసి, మా అన్న రాముని తిరిగి తీసుకొనిపోయి అయోధ్యలో పట్టాభిషిక్తునిచేయను వచ్చినా" అన్నాడు. ఈ మాటలు వినగానే గుహుడు, భరతుని అడుగుదామరల గట్టిగా పట్టుకొని—

"విమల యశోవిశాలా,
యోచించి విలువగట్టేవారికి నీ శీలము అమూల్యము!
వేయి రాములు నీకు ఎనగారు"—అన్నాడు.

భరతుడు గుహుని అడుగుతున్నాడు–"నిన్ను వేడుకొంటా, మా అన్న రాముడు ఎక్కడ శయనించినాడు". గుహుడు భరతుని మున్యాశ్రమంలోనికి తోడ్కొని పోయినాడు. అక్కడ దర్భలు పరచియుండిన ఒక కటిక రాతిబండను చూపి, "ఇదీ రాముని పడక" అన్నాడు. దానిని చూడగానే భరతుడు నిలువెల్లా వణకి నేలగూలి, వగపు పొంగులో మునిగిపోయినాడు. తెప్పరిల్లి – "ఇది ఆ మహామహుడు నిదురించిన చోటైన, ఆయనపట్ల అపార ప్రేమ గలిగి, ఆయన వెంటదగిలి వచ్చిన ఆ సోదరుడు రేయి గడపిన చోటు ఏది?" అని అడిగినాడు.

గుహుడు చెపుతున్నాడు—
"ఆ శ్యామల సుందరుడు సీతమ్మతో
ఇచట ఏకాంతమున నుండగా,

బయుట లక్ష్మణుడు చేత విల్లుబట్టుకొని
కావలిగాచే వాడు.
వేడి నిట్టూర్పులతో ఊగిపోతూ
కన్నీరు గురిసే కండ్లతో
రెప్పపాటు లేకుండా
నిశాంత అవధి రేఖలు కాన్పించే దాక
ఊ్లై కా వుండేవాడు.

గుహుని ఈ నివేదనము హృదయస్పందనకారిగా ఉన్నది. భరతుని కోర్కెపై, గుహుడు భరతుని అరవైవేల సైన్యాన్ని, వెంట వచ్చిన దుఃఖార్తులైన అయోధ్యానగరవాసులను, లెక్కకు మీరిన పడవలలో మొదట గంగను దాటించి, తనవైపు దరికి చేర్పించినాడు. తరువాత భరతుడు, ఆయన తమ్ముడు-శత్రుఘ్నుడు, ముగ్గురు తల్లులు, మంత్రి సుమంత్రునితో ఒక ఉడుప నెక్కినారు. దానిని గుహుడే తెడ్డువేసి నడుపుతుండగా, అప్పు డా కలము తెడ్డు అనే అందమైన కాళ్ళతో నీటిపై ప్రాకుచూ, ఆవలిగట్టు మొగమై పోతున్నది.

అట్లా వారు దాటేటప్పుడు, నట్టేట గుహుడు కౌసల్యను చూసి, "ఈమె ఎవరు?" అని భరతుని అడిగినాడు. భరతుడు, "సర్వ భువనములు పుట్టించు అజుని నిజనాభిలో పుట్టించిన ఘనుని కడుపారగాంచిన పుణ్యవతి ఈమె! నా పుట్టువువల్ల తన భాగ్యభోగా లన్నిటిని కోల్పుచ్చుకొన్న మహాసాధ్వి ఈమెయే". ఇది వినగానే గుహుడు కౌసల్యాదేవి పాదములపై బడి పలవించినాడు. అప్పుడు ఆ రాణి గుహుని జూసి, "ఇతడెవడు?" అని భరతుని ప్రశ్నించినది. "రామునికి ప్రీతిపాత్రుడైన హితుడు-గుహుడను కిరాతరాజు. నాకు నా తమ్ములకు పెద్ద అన్న" అని బదులు చెప్పినాడు. దానితో గుహుడు కంట తడి బెట్టగా, భరత శత్రుఘ్నుల కండ్లకు నీరు గ్రమ్మినది. వారి నందరిని ఓదార్చిన కౌసల్య భాషణపద్యము, ప్రసన్న మంగళా చరణ శక్తిని ప్రసరింపజేస్తున్నది. ఈ పద్యాన్ని మూల తమిళంలో చదివే టప్పుడు గంధర్వ సహస్ర పక్ష విక్షేప ధ్వనితో వాతూలము తరంగితమై పోతుంది. ఆ చలనము సంతాప క్షత బాధితమైన భూతల జీవి హృదయాన్ని, ఉపశమనదక్షమైన సురభిళవాతపోతం వలె తాకును.

కంబుని సంగీత శాస్త్ర కౌశల్యసిద్ధి బహుముఖమైనది, విస్తారమైనది. సుదీర్ఘ పంక్తులు వ్రాయుటలో నిపుణుడు; ఇది ఒక అరుదైన ప్రజ్ఞ, పాత్రలకు, సన్నివేశాలకు తగిన రసస్ఫూర్తితో ఈ సంగీత జ్ఞానమును ప్రయోగించి రంజింప జేస్తాడు. ఇదే ఆయన కవితా శిల్ప పరమావధికి సుస్పష్ట సాక్ష్యము. ఈ రసాత్మక శబ్దాలు పాఠకుని మనసును చొచ్చుకొని పారవశ్యమును పుట్టించు చుండును. ఈ పద్య సారస్యము – శబ్దశక్తి – గంభీర ధోరణి అనువాదానికి అందనివి. అయినా, కథా గమనానికి భంగం కలుగకుండా ఈ పేలవమైన మాటలు చెప్పవలసి ఉన్నది;

కౌసల్య పలుకు తున్నది—

బిడ్డలారా దుఃఖింపకుడు; ఇక పరితాపం వలదు,
ఆ సత్యయోధుడు
రాజ్య పరిత్యాగము చేసి వనముల జేరుట
లోక శ్రేయానికే!
ఈ మహావీరునితో మైత్రిని పెంచుకొనుడు.
ఇతడు—
భూధర బలస్థైర్యోపేత హస్తం గల
వీరకుంజరము వంటివాడు!
ఇతని స్నేహబంధంతో
మీ రైదుగురు ఒకరై
ఎన్నో ఏండ్లు పూండ్లు ఈ భువిని ఏలగలరు!

పరిపక్వమైన సౌమ్య పరితాపం గల కౌసల్య మాతృ హృదయము, కులహీనుడైన కిరాతుని, ఉత్తమ జన్ములైన స్వపుత్రులలో ఒకనినిగా పరిగణించినది. ఈ పాటలో మహాకావ్య లక్షణమైన ఉదాత్తభావం ఒకటి నిండియుండి, పాఠకుని సాధారణ మానవ క్షుద్రవర్తనం నుండి పైకి గొనిపోవు తున్నది.

మూర్తిమంత మైన సౌశీల్యంగా నున్న సుమిత్రను చూపుచూ గుహుడు – "ప్రేమ రసపూర్ణమైన ఈ పావని ఎవరు? దయచేసి చెప్పండి" అన్నాడు. భరతుడు ప్రత్యుత్తరమిస్తున్నాడు—"ఎవరు అస్ఖలిత సత్యము

స్థిరస్థాయి అగుటకు ప్రాణార్పణం గావించినాడో, ఆ మహాభాగుని చిన్న భార్య – సుమిత్రాదేవి. ఈ మహనీయయే రాముని నుండి విడదీయరాని తమ్ముని – లక్ష్మణుని కని, ఆ పూజనీయ రామునికి ఒక తమ్ముడుగూడ ఉన్నాడని ప్రకటించిన పుణ్యమాత" అని.

ఈ పరిచయ వాక్యాలు పలికిన తర్వాత, గుహుని దృష్టి కైకపై వ్రాలుననన్న భయము కంబునికి పట్టుకొన్నది. ఆ సుప్రసిద్ధ రసికమణి – టి. కె. చిదంబరనాథ ముదలియారు పేర్కొన్నట్లు – ఈ సంకట భావమును క్రింది పద్యంలో సునిసిత మనోహరంగా ప్రకటించినాడు—

తన భర్త కాటికి పోగా
తన కొడుకు శోకవారాశిలో మునిగిపోగా
దయాసముద్రుడు – ఆ రాముడు
క్రూరారణ్యములకు పోగా,
వాఙ్మానసాతీతుడైన ఆ పౌరాణిక విష్ణువు
విక్రమించి నిజరూపంతో
సర్వ ప్రపంచాలు కొలిచినట్లు –
విలాస ప్రియమైన నిజహృదయ క్రౌర్యంతో
ఈ ప్రపంచాన్ని కొలిచి చూచిన ఆ స్త్రీని –
కైకను గుహుడు వ్రేలిడి చూపి—

"దయచేసి ఆమె ఎవరో చెప్పండి" అని ప్రాధేయపడినాడు.

ఇక్కడ కంబకవి, ఇంతవరకు మనసులో అణచిపెట్టబడి యుండిన క్రోధాన్నంతా భరతుని చేత ఇప్పుడు బయటికి వెడలగ్రక్కిస్తున్నాడు. ఇదీ ఆయన ప్రత్యుత్తరం—

"ఉన్న ఖల సంతకెల్ల కర్త
ప్రతి హింసాశిశువును పెంచి పెద్దజేసిన పెంపుడుతల్లి,
ఆమెయే !
తన అభిశప్త గర్భంలో అంతకాలము
నన్ను మోసిగూడ
కొడుకని ఎంచక దయాహీనంగా

నన్ను కారియ పెట్టినదిగూడ
ఆమెయే !
అమె ఒక్కతెయే, జీవకోటి సర్వస్వము
చచ్చినట్లు పడియుండ
ఈ ప్రపంచంలో ఆమెయే – ఆమె ఒక్కతెయే
దుఃఖచ్ఛాయా రహిత సంతోషదీప్త
ముఖమును కలిగియున్నది !
ఆమె ఎవరో ఇంక ఊహించుకోలేకున్నావా ?
ఇట్లా నిలబడియున్న ఆమెయే నన్ను కన్నతల్లి!

ఇవి అత్యంత తిక్తవచనాలు. అక్కడ ఉన్నవారినందరిని సందిగ్ధా వస్థలో బెట్టినవి. వెంటనే కవి, ఈ స్థితినుండి పాఠకులను బయటవేసి మన శ్శాంతిని కలిగించేదానికి ఆ నౌకా రంగంమీద యవనిక దింపుతున్నాడు. వెంటనే భారవంతమైన దీర్ఘపాద వృత్తంనుండి లేఖినిని మరలించి, హఠా త్తుగా హ్రస్వపాదులలోనికి దింపినాడు :–

ఆ దయాశూన్యమైన చెనటిసిగూడ
గుహుడు తల్లిగా భావించినాడు !
వెంటనే ఆయన తన పవిత్రహస్తాలతో
ఆమెకు ప్రణామా లర్పించినాడు !
ఇంతలో ఆనావ –
రెక్కలులేని ఒక కలహంసివలె దరిని చేరినది !

ఈ క్లిష్ట పరిస్థితిని సరిదిద్దుటలో కవి, అపూర్వ నాటకీయ నైపుణ్య మును ప్రయోగించినాడు. అసమర్థ కవులచేతులలో పడియుండినచో ఈ సన్ని వేశం భ్రష్టుపట్టి ఉండేది. లోపలికి లాగివేసిన తెడ్లుగల పడవకు – రెక్కలు లేని అంచకుగల పోలిక ఎంతో విస్మయజనకంగా ఉండి, పాఠకుని మన సును పీడాకరమైన అవస్థనుండి మరలించి, మనోజ్ఞమైన ఆ ఉచితోప మానంపై లగ్నం చేస్తున్నది. ఇంతలోకే పడవ దరిజేరినది; అందరూ దిగే ఆనందము తొందరలో పడపోవడం కల్పించి, ఆదారుణ వచనాఘాతాన్ని మరచిపోయేటట్లు చేస్తున్నాడు.

# భువికి దిగివచ్చిన స్వర్గము

నావలనుండి దిగగానే భరతుడు – ఆయన పరివారము ప్రజలూ కాళ్ళీడ్చుకొంటూ నడచి, దగ్గరనే ఉండిన భరద్వాజాశ్రమం చేరినారు. ఆ మౌని ఎదురు వచ్చి, ఆ రాణువనంతా తన మునిపల్లెలో కుటీరాలకు తీసు కొని పోయినాడు. ఆ ఋషి నిజతపోమహిమతో సంకల్పించగానే స్వర్గమే తేలియాడుతూ దిగివచ్చి భువిపై ఒయ్యారంగా వారి ఎదుట నిలిచినది. వెంటనే రంభాదులు ఎదురువచ్చి వారిని పొగడి, చంద్రమండల సౌధాలవలె నున్న విడుదులకు కొనిపోయి అందు వారిని నిలిపినారు. ఆవల భరతుని పరిజనం మిన్నువాకలో ఇష్టంవచ్చినట్లు మునిగినారు. అప్సరలు ఆ జనాని కంతా చందనమలది, పూలు ముడిచి, కుసుమకోమలాలైన వలువలు కట్టబెట్టి, నగలు దెచ్చి సొగసు చేసినారు. అమృతోపమానమైన రాజభోజనంతో పెద్ద విందు జరిగినది. రాత్రి పొద్దుపోగా, పట్టుపరుపులు అమర్చి వారినంతా పరుండబెట్టినారు – ఆ దేవలోక జనం.

ఇట్లా ఏలిక మొదలు పల్లకి మోయువారివరకు విందు భోజనాలు సుర భోగాలు అనుభవించి, ఆ గుంపంతా దేవతా స్త్రీలను తలచుకొంటూ తూగులోబడి మునిగిపోయినారు. భరద్వాజ దీవనలు వీరందరు పొందినారు.

స్వర్గభోగా లనుభవిస్తున్న భరతుని పరివారాన్ని కవి ఇప్పుడు ఇక్కడనే విడిచిపెట్టి, సీతారామలక్ష్మణులు హాయిగా నివసిస్తున్న చిత్రకూటానికి మనలను తీసుకొని పోతున్నాడు.

ఒకపూట లక్ష్మణుడు తమ ఆకుపందిలి మొగసాలలో కూర్చుండి యుండగా, చూపు ఆనీ ఆనని దూరాన, మసగగా ఏదో ఒక ఆకృతి కది లాడు చున్నట్లుగా చూచినాడు. దగ్గరనే ఒక కొండ భూగర్భంనుండి పై కుబికిన ఒక నిప్పు నాలుక కూచికొనవలె మండుతూ ఉన్నది. లక్ష్మణుడు దాని శిఖరం ఎక్కి నిలబడి, ఉత్తరపు దిక్కు చూస్తుండగా, కదలి వచ్చే ఒక విలుకాండ్ర కడలి కనబడినది. అది దండయాత్రకు వస్తున్న భరతుని సేనా సముద్రం అనే దానికి ఏమీ సందేహం లేదు. లక్ష్మణుడు గుహునివలెనే భక్తిపరుడు; ముందువెనుకలు యోచించని ఉద్రేకి; అందువల్ల భరతుని ఉద్దేశాన్ని అపార్థం చేసికొని, క్షణంలో ఆ విరోధిని నిరోధించను సత్వర వ్యూహాలు పన్నినాడు. ఒక్క గంతుతో క్రిందికి దూకినాడు. కాళ్ళతో

తొక్కి కొండల పిండిచేస్తూ, దాని రవధూళిని మొయిలువలె పైకి లేవదీసి నాడు. అదరా బదరా రాముని దగ్గరకు పరుగెత్తి ఊరిమి పలికినాడు:– "ఆ భరతుడు గౌరవం చూపేదానికి బదులు అయోధ్యలో ఉండే అపార సేనా నివహాన్ని సమకూర్చుకొని నీపైకి ఎత్తివస్తున్నాడు" – అని, ధనుర్బాణ తూణీరాలు ధరించి, రాముని పాదపద్మాలకు వినయ విధేయతలతో మ్రొక్కి: "ఇదిగో! ఇప్పుడే భరతుని సైన్యాల పీనుగు పెంటలు చేస్తా" అన్నాడు. త్రుటిలో ధర్మాధర్మముల మధ్య – దేవాసురుల మధ్య జరిగిన ఘోర యుద్ధం లక్ష్మణుని మనోనేత్రంలో రూపొందినది: జరుగనున్న బీభత్స సమరాన్ని కన్నులకు గట్టినట్లు, వీరరసోత్పాదకంగా అన్నకు వరిస్తున్నాడు:–

"నెత్తుటేళ్లు సుళ్లు దిరిగి నురుగులు గ్రక్క
 నురవడిలో పారి
మున్నీటిని ముంచివేయడం
 నీవే చూడగలవు!
ఆ రుధిర వాహినులు
 అధర్మాన్ని సమూలంగా తుడిచిపెడుతూ
ద్వీపాల విడంబించు వేదండ తండాల
 తలక్రిందులు చేసి దొర్లించుకొని పోతూ
రథావళిని తుడిచివేసి నీటగలపడం
 రాఘవా, నీవే చూడగలవు!"

స్వల్పతమాంశాన్ని అయినా రసవత్తరంగా వర్ణింప దక్షుడైన కంబ కవి, ఈ కీలాలస్రవంతులను వృథాగా జారవిడుచునా? లక్ష్మణునిచేత వాటికి ప్రయోజనం కల్పిస్తున్నాడు:–

"ఇంతేగాదు, రఘువంశమణీ
 నెత్తుట మునిగి ఒడలెల్ల ఎర్రనైన
ప్రేతభూతతతి, మూసురుకండ్ల మరుగుజ్జులు
 తలలులేని మొండెములు
పొంగే రక్త ప్రవాహంలో ఈదులాడుతూ
 వేల్పులవలె ఆనందాతిరేకంతో నృత్యంచేస్తూ

రాజ్యం మరల మీదైనదని కేకలిడుటను
నీవే కాంచగలవు రామా''

అని, ''రాజాజ్ఞచే భరతుడు భూతలరాజ్యం ఏలుతున్నాడు; ఇక నా సనంతో నరకరాజ్య పాలనం ప్రారంభించగలడు'' – అన్నాడు.

ఈ క్రోధాభిశాపాలు విని, రాముడు పరితపించినాడు. సౌమ్యవాక్య రచనలో పలుకుతున్నాడు:–

''తమ్ముడా, లెక్కకుమీరిన ధర్మశాస్త్రా లన్నిటికి
నీతినిగూర్చి మాట్లాడను మాత్రమే తెలియును;
కాని, భరతుడు నీతి ధర్మమును
పాలించ నెరుగును,
ఆ సత్యసంధుడు చేసినదే
ధర్మము – శ్రుతిహితము,
ఆయన చేయనిదే ధర్మేతరము!
నీకు నాయందున్న ఉత్కట ప్రేమతో
ఈ పలుకులు పలికినావు;
ఆ పరమోత్కృష్ట ధర్మదేవతను –
పరిపూర్ణత్వానికి కీలకమును
ఇట్లాడదగునా? వత్సా,
నిన్నుచూచి కీర్తించి సన్మానించనే
అతడు ఇచటికి వస్తున్నాతు!
జ్ఞానవికాస మార్గాన ముమ్ముందు
నీవు దీనిని తెలిసికోగలవు''

రాము డిట్లా పలుకుచుండగానే, భరతుడు శత్రుఘ్నుని వెంటబెట్టుకొని, ఆతురతతో త్వరత్వరగా రాముని డాయ వచ్చినాడు. ప్రార్థనపూర్వకంగా చేతులెత్తి, కాంతిచెడి కృశించిన దేహంతో, కన్నీటకరగిపొయ్యే కనుగ్రుడ్లతో – ''ఇదే పరితాపమూర్తి చిత్రము'' అన్నట్లు దుఃఖన్నా కృతితో ఉన్నాడు – భరతుడు.

రాముడు భరతుని నిలువెల్లా పరికించి చూచి, తల ఊంకించి, లక్ష్మణుని తట్టు చూచి:–

"ధనుశ్శింజనీరావం చేసే సోదరా, చూడు!
నీ రెండు కండ్లతో తేరిపార జూడు!
యుద్ధదాహం గల భరతుడు ఇతడేనా?
ఈ నారచీరల వేషంతోనేనా
అస్త్రశస్త్రానీకాల నడుపునది?"

లక్ష్మణుడు బిమ్మెరపోయి అట్లే నిలబడిపోయినాడు. పరుష వాక్యాలు విరుగుడైపోయినవి. అశ్రుధారతోబాటు అయన క్రోధము – సంధించిన శరాసనము జారి క్రిందబడిపోయినవి. భరతుని దేహము దుఃఖార్తిలో కృశించి మ్లానమై ఉన్నది. కట్లు వీడిన లేగదూడ తల్లి ఆవు దగ్గరకు పరుగెత్తినట్లు భరతుడు రాముని దగ్గరకు పరుగెత్తి, నిష్ఠురోక్తులు పలుకుతున్నాడు:—

"మీరు ధర్మమునుగూర్చి చింతింపరైతిరి,
ప్రేమానురాగాలకు స్వస్తి చెప్పినారు,
న్యాయపాలనము త్యజించినారు"

అని, వెంటనే రాముని పాదాలకడ సాగిలబడి పోయినాడు. అప్పుడు భరతునికి మరణించిన తమ తండ్రి మరల బ్రతికి వచ్చి ముఖాముఖి నిలిచి నట్లు తోచినది. అంత, రాముడు కన్నీటి జడితో తమ్ముని జటాజూటాన్ని తడిపి, గారవంతో మెల్లగా లేవనెత్తి బిగికౌగిట చేర్చినాడు.

ఈ దృశ్యం ఈ కవిరాజును కారుణ్యచకితునిగా చేసినది; ఆవేశంతో వ్రాస్తున్నాడు:—

ప్రేమమూలమైన ధర్మము
సమస్త నీతిసూత్ర భాండారమును
పరిష్వంగ మొనరించినది!

తర్వాత రాముడు – "ఊర్జిత బాహుబలుడు–ఆరాజు ఎట్లున్నాడు?" అని దశరథుని విషయమై భరతుని అడిగినాడు. "అన్నా, ఆయన ఇక లేడు; మీ వియోగ వ్యాధియే అయన మృత్యుహేతువు. నన్ను గన్న ఆపాపి కైకేయి కోరినవరమే ఆయన ప్రాణములు హరించిన యముడు" అన్నాడు – భరతుడు. ములుకులువంటి ఈ మాటలు వినగానే రాముడు నేత్రాలు

హృదయంతోబాటు పొరిగి బొంగరంవలె సుడిదిరిగినవి. ఉత్తమునికంటె ఉత్తమోత్తముడైన ఆ రాముడు వెంటనే నేలగూలినాడు.

వసిష్ఠముని – "వత్సా, మరణము జననమువలెనే ప్రకృతి ధర్మము. సర్వశ్రుతి ధర్మము తెలిగిన నీవే -ఈ సత్యమును మరచినావా రామా?" అని ఊరడించగా, రాముడు తెప్పరిల్లి తేరి, దగ్గరనున్న ఒక కొండవాగుకు బోయి స్నానమాడి, గురువు చెప్పిన విధుల నాచరించి, ముమ్మారు తర్పణం వదలినాడు.

దీని తర్వాత జరిగిన కరుణారసపూర్ణమై హృదయాల కరగించే దృశ్యాన్ని స్థలాభావంచేత రచయిత వ్రాయలేకపోతున్నాడు. రాముని రాజ్య భారం వహించమని భరతుడు ప్రార్థించినాడు. కాని, రాముడు తండ్రి అనతి ప్రకారం పద్నాలుగేండ్లు వనములందే ఉందునని, తనకు మారగా రాజ్యాన్ని తన శాసనంగా పాలించమని భరతునికి చెప్పినాడు.

## భరతుని పరిపాలనము

ఆ పదునాలుగు దీర్ఘ వత్సరాలను గురించి చింతించిన కొలది దైన్యము-చింత భరతుని పైకొన్నవి. ఆ స్థితిలో ఆయన మానసము – సర్వజగత్తును, అందలి చేతనసర్వస్వమును నడిపే ఆదైవ విభూతికి లక్షణభూతమైన ఆ దేవదేవుడు – రాముని పాదపద్మ సన్నిధిని చేరుకొన్నది. వెంటనే – "మీ పునీత పాదములు ధరించిన పావన పాదుకలను నాకు దయచేయండి" అని రఘోత్తముని ప్రార్థించినాడు. ఇహపరములందు భరతునికి దివ్యానందము నొసంగ తన పాదుకలను రాముడు తమ్మునికిచ్చినాడు.

భరతుడు, కన్నీటి ఊటలైయున్న కండ్లతో, ఆ పాదుకలను విధ్యుక్తంగా తలదాల్చి – "ఇవే నా మణిదీపిత మకుటము" అని సంతసించి, రాముని పాదాలకు సాష్టాంగ దండ ప్రణామా లాచరించినాడు. అప్పుడు రాముని పాదరజ దీపితమైన భరతుని దేహము శోభావంతమైనది.

ఆ వచ్చిన వారందరి నిష్క్రమణతో అయోధ్యాకాండము ముగిసిపోతున్నది.

4

# ఆ ర ణ్య కా ం డ ము

## పాప పరిహారదక్షములైన పాదములు :

సీతా రామ లక్ష్మణులు – ముగ్గురు చిత్రకూటాద్రిని వదలి దండకారణ్యం ప్రవేశించినారు. అక్కడ విరాధుడు అనే ఘోర రాక్షసుడు తలపడి, రాకొమారు లిద్దరిని మ్రింగివేస్తానని బెదరించినాడు. రాముడు ఆ అసురుని ఒక్కతన్ను తన్నగానే – ఆ పాదస్పర్శచేతనే, అతని ఆ భయంకర రూపం మారి, తన పూర్వ సౌమ్యరూపం దాల్చి నమస్కరించి – ''ఇంద్రుని ఆస్థానంలో తుంబురుడనే ఒక సంగీత విద్వాంసుడను. కామభోగలాలసుడనైనందున ఇంద్రుడు కోపగించి, రాక్షసుడు గమ్మని శపించినాడు. కడకు రాముని పాదములు సోకగానే పూర్వ రూపాన్ని పొందగలనని ఉపశమన వాక్యాలు గూడ పలికినాడు'' – అని, తన కత జెప్పినాడు. తన శాపము–దాని విముక్తిని గూర్చి గమనం చేసుకొని, రాముని కృపాతిశయాన్ని గూర్చి విరాధుడు కొన్ని మనోహర గీతాలను పాడుతున్నాడు :—

''శ్రుతులు స్తుతించిన పాదాలు
విశ్వ వ్యాపకములైన పాదాలే
ఈ మీ పాదాలైనచో
మీ విశ్వరూపం ఎంత విస్తారంగా ఎంత సుందరంగా
ఉండవలెనో గదా!''

ఈశ్వరుడు సమస్త భూతకోటి జీవాత్మలందేగాక, జడప్రకృతి యందు గూడ నివసిస్తున్నాడు. కాని, ఈ ప్రాణికోటి ఆయనను ఎరుగలేకుండుటే ఒక నిగూఢ రహస్యము. ఈ సృష్టి–ఆ సృష్టికర్తల పరస్పర సంబంధం ఏ సూత్రానికిగాని కట్టుబడియున్నట్లు లేదు.

"ఆవును ఎరుగని దూడ, దూడ నెరుగని ఆవు లేవు;
ప్రభో, ఈ సర్వజగత్తుకు మీరే తల్లి;
మీరు మీ సంతానమును బాగుగ నెరుదుగురు,
కాని ఆ తల్లిని ఈ జగమును ఎరుగలేకున్నది
ఎంతటి చోద్యమో గదా!

ఏమాయా నిబద్ధ అజ్ఞానము, ఇట్లు
లోక చక్షువులను గప్పుచున్నదో గదా!
రానివానివలె దోచి, వచ్చు చుండెడి
ఓ దేవా, ఈ మర్మము నీవే చెప్పదగినది."

సర్వుల–జ్ఞాని అజ్ఞాని హృదయాలలో నివసించే పరాత్పరుడు, అజ్ఞానికి దివ్య జ్ఞానోదయమైనప్పుడే కనబడుతున్నాడు. అందువల్ల ఆయనను చూడగలిగినప్పుడే ఆయన ఉన్నాడనుట సరిఅయినది కాదు. జీవి భగవంతుని అనుసంధించుకొనేదానికి ముందుగూడ అతని ఆత్మయందు నివసిస్తూనే ఉన్నాడు. ఈ పరమ సత్యాన్నే కవి విరుద్ధభావరూపంలో విరాధుని చేత "రానివానివలె దోచి, వచ్చుచుండెడివాడు" అని కీర్తింపజేస్తున్నాడు. కంబుని మతప్రకారం దేవుని వాస్తవిక ఉపస్థితి, మానసిక భావం వల్లనే కలుగుతున్నది.

విరాధుడు పోగానే, ఆ ముగ్గురు శరభంగ మహర్షి ఆశ్రమం చేరుకొన్నారు. ఆశ్రమ ముఖ ద్వారంలో సురలోకాధీశ్వరుడు – ఇంద్రుని రాజ లాంఛనాలు కనిపించినవి. ఇంద్రుడు వచ్చియుండునేమోనని, ఆయనను చూడను రాముడు ఆశ్రమంలోకి పోతున్నాడు.

ఈ పట్టున వాల్మీకి రామాయణంలో ఇంద్రుడు రాముని దూరాన చూచీ చూడగానే, రాముని సందర్శింపకనే హుటాహుటిగా ఆశ్రమం వదలి పోవును. ఎందుకంటే – భూలోకంలో రాముడు సాధించవలసిన మహాత్కార్య మున్నదని, తమ సంభాషణలవల్ల దానికి విలంబనం కలుగునని భయపడినాడు. కాని, కంబరు ఇంద్రుడు రాముని కలుసుకొన్నట్లు కూర్చినాడు. దీనితో దేవగణ ప్రార్థనంపై భగవంతుడు మానవ రూపంలో భూమిపై ఉద్భవించి, దుష్టశక్తులను నిర్మూలించ బోతున్నందులకుగా, రామునికి తన కృతజ్ఞతను తెలుపుకొనేదానికి అవకాశం కలిగించినాడు.

ఈ సమావేశాన్ని కల్పించినందున, దేశకాలావచ్ఛిన్నమైన భౌతిక సంఘట లను అనంత విశ్వదృష్టితో వివరించి, మానవుని భూతల బద్ధ భావసీమల పెంచి విశాలం చేయను కవికి మంచి అదను దొరికినది.

ఇంద్రుడు రాముని స్తుతిస్తున్నాడు—

"సమస్త వస్తువు లందును ఏకరూపము నొంది,
అంటీ అంటక యుండు
తేజోరూపుడవు దేవా నీవు.
దైత్య శత్రువులచే పడరాని ఇడుమల బడి
మీ పాద సన్నిధిని తలచుకొని
రక్షింప వేడియుంటిమి.
ఆనాడు అనుగ్రహించిన అభయ పరిపాలనకై
స్వామీ, మీరిప్పు డరుదెంచినారు!
కాబట్టే మీ పవిత్ర పాదపద్మాలు రెండూ
ఇప్పుడు భూమిపై ఆని ఉన్నవి."

## పరహితార్థ క్లేశము

భగవంతుడు తన భక్తులపట్ల చూపే కృపాతిశయాన్ని, కేవలమూ మానవుని విమోచనానికిగా,ఆయన తన అనంత విశ్వావాసాన్ని పరిత్యజించి, దేశకాల పరిధులకు కట్టుబడి, మానవాళి సుఖదుఃఖాల హైన్యానికి భాజనుడగుటను తలచుకొని, ఇంద్రుని మనస్సు కరిగినది.

తన స్తోత్రగీతాన్ని ఇంకా ఇట్లు సాగిస్తున్నాడు :-
"నీ దైవాంశంతో సంబంధం లేనివారు
ఎవరునూ లేరు;
అట్లే నీతోడి సంబంధం పూర్తిగా
కలిగినవారునూ లేరు;
నీ విభూతికి పగలేది? రాత్రి ఏది?
దానికి ఊర్ధ్వ అధోలోకాలన్న
మేర లేదు

బాల్య యౌవన వార్ధక్య దశలు
నీ వెరుగవు!
నీవు ఆది మధ్యాంత రహితుడవు!
నీకు పూర్వాపరాలు లేవు;
దేవా, నీ రూపు ఇట్టిదైయుండ
ఈ భువికి దిగివచ్చి,
కార్మిక భారమును వహించి,
మీ పాద అరుణిమను
ఈ యాన క్లేశంచేత మరింత ఎర్రగ జేసుకొని,
మమ్ము రక్షింపక పోయినను
నిన్ను నిందించువా రెవరు?
అనంతకాల వారాశిలో నిదురించే
ఓ దేవా,
మా దుఃఖార్తిని పోకార్చి నందులకు
నీ కేమి లాభము?"

## అనంతత్వమును కొలుచుట :

ఇంద్రుడు తనకున్న భక్తిసాంద్రతలో, అపరూపమైన ఒక బ్రహ్మాండ భావనాపాత్రను కల్పించుకొని అనంతత్వాన్ని కొలువదలచుకొన్నాడు. కాని, ఆ పనికి ఆ పాత్ర బొత్తుగా చాలదని వెంటనే గుర్తెరిగినాడు. ఇక పలుకుతున్నాడు :

"జగత్సృష్టికర్త—ఆ నలువ
గ్రహమండములనెల్ల కలిపి ముద్దజేసి
ఒక పెద్ద కొలపాత్రను జేసి
యుగయుగాలుగా నిన్ను కొలువనిమ్ము;
కాని, అపరిమేయమైన నీ విభూతి
కొలతకందక తరుగక అట్లే నిలిచియుండును.
ఈ భూమండలాన్ని భాండంగా జేసి
మున్నీటి నీరు పెరుగుగా
మేరువు కవ్వంగా

నీ హస్తపద్మాలను కారియపెట్టి చిలికి
మాకు అమృతాన్ని పంచిపెట్టినావు;
ఇక రాక్షసులు నీ కెట్లు దాసులు కాగలరు?"

ఇప్పుడు, సీతా రామ లక్ష్మణులు అగస్త్య మునీంద్రుని పర్వతాశ్రమానికి తరలినారు. ఆ ప్రదేశమంతా, అప్పుడే దీసిన జుంటి తేనెవంటి నీరు నిండిన సెలయేళ్లు అడ్డదిడ్డంగా పారుతున్నవి.

## యోగ మహత్వ విలసితమైన వేదండము

అగస్త్య మహర్షి పాండిత్యము అగాధము; ఆయన సర్వకళా కుశలుడు. ఆయన కళలు – కవిత్వము – ఆధ్యాత్మిక విద్యయందే గాక, భౌతిక విజ్ఞానము–వైద్యము–శస్త్రాస్త్ర విద్య–ఏటికి అనకట్టలు గట్టుట–నీటి పారుదల మొదలైన ప్రాపంచిక విద్యలందు గూడ ఆరితేరినవాడు. (ఇప్పటి) తిరునెల్వేలి మండలంలో గల పొదిగై కొండలలో నెలకొల్పబడి యుండిన ఆయన విశ్వకళాపరిషత్తులో చదువను వివిధ ప్రాంతాలనుండి విద్యార్థులు వచ్చేవారు. విజ్ఞానానికి సంస్కారానికి ఆయన పుట్టుసొన. తన మునిపల్లె పరిసరాలలో రాముడు ఉన్నాడని తెలియరాగానే, ఆయనే ఆతురతతో ఎదురేగి ఆహ్వానిస్తాడు. ఇక, వాల్మీకి అగస్త్యుడు, ఒక దూతను రాముని తీసికొని రాను పంపుతాడు.

తమిళనాడులో పరంపరానుగతంగా వస్తున్న ఒక జనశ్రుతిప్రకారం–అప్పటికి బయల్పడిన మానవ విజ్ఞానాన్నంతా పొందుపరుస్తూ తమిళంలో అనేక గ్రంథాలు ఆ ఋషిపుంగవుడు వ్రాసినాడు. తర్వాత దక్షిణ తమిళ ప్రాంతము కొట్టుకొనిపోయి సముద్రంలో మునిగిపోయినప్పుడు ఈ గ్రంథాలన్నీ నాశనమై పోయినవి. అందువల్లనే విష్ణువు త్రివిక్రముడై జగత్తునంతా అధిగమించినట్లే అగస్త్యుడు దీర్ఘ ద్రావిడభాషాహస్త దండముతో సమస్త విజ్ఞాన శిఖరములను కొలిచినాడు —అని కవి వర్ణించినాడు.

తర్వాతి పాటలో కవి, ప్రతీకరూపమైన అర్థాన్ని సూచించే ఒక గాథను ప్రస్తావిస్తున్నాడు:–ఎప్పుడో, చాలా పురాతనకాలంలో, అసుర శాఖ ఒకటి, ప్రపంచమందలి నైతిక ఆధ్యాత్మిక పెన్నిధుల నన్నిటిని స్వాధీనం చేసికొని, వాటితోగూడ సముద్రపు టడుగుకు పోయి దాగుకొన్నది. అప్పుడు

దేవగణం అగస్త్యునిదగ్గరకు పోయి, మునిగిపోయిన ఆకళానిధులను రక్షించి బయటకు దీసికొని రమ్మని ప్రార్థించినది. అగస్త్యుడు ఈ వేడికోలును మన్నించి, ఆ మహా సముద్ర జలాన్నంతా తన పురిసిటబట్టి త్రాగి ఒక్క చుక్కగూడా లేకుండజేసి, సముద్రగర్భంలో పడియుండిన ఆ విజ్ఞాన నిధులను మరల మానవకోటికి దక్కించినాడు. ఆ తర్వాత, దేవతల ప్రార్థన మీదట, కడుపులో ఇమిడి ఉండిన మున్నీటి నీటినంతా నోటిగుండా ఉమిసి మరల సముద్రాల నింపినాడు.

రసికమణి టి. కె. చిదంబరనాద ముదలియారు ఈ ఆఖ్యానాన్ని, ఐదు శతాబ్దాలకు ముందు మిరాణ్దోలా అను ఒక ఇటలీ మహాపురుషుని చర్యలతో పోల్చి అన్వయించి అర్థం చెపుతున్నాడు. ఆనాడు గ్రీకుల లలిత కళలు – సాహిత్యాలు ఎంతో సూక్ష్మంగాను క్లిష్టంగాను ఉండినవి. ఈ గ్రీకు సంస్కృతితో సంబంధం లేని ఇటాలియనులు వీటికి అపార్థాలు కల్పించి అపచారం చేసినారు. కళారసికత అణుమాత్రం గూడ లేని ఇటలీ వైయ్యాకరణ సముదాయము—వ్యాఖ్యాతృబృందము తమ ఊసర విజ్ఞానాన్ని, కోమల రమ్యమైన గ్రీకు కళాఖండాలపై చెర్లాటమాడించినారు. దీనిలో గ్రీకు సంస్కృతిలోగల సుకుమార లావణ్య పూర్ణ విషయాలన్నిటికి మసిబూసినట్లు కళాహీనమై పోయినవి. ఈ కారణంగా కువ్యాఖ్యాతలు మిథ్యావాదులు ఒక విధంగా కళకు అరులైన అసురగణమైనారు. అవగాహన శక్తిహీనులైన ఈ పండిత బ్రువులు గ్రీకు మేధాసంపత్తి సృష్టించిన కళా సౌభాగ్యాన్ని ఎగతాళిపాలు జేసినారు. అట్టి ధ్వాంతయుగంలో మిరాణ్దోలా ఉద్భవించినాడు. గ్రీకు కళలను అత్యంత సునిశిత బుద్ధితో చదివి, ఇటలీ వ్యాకరణ పండితులు వ్యాఖ్యాతలు చేసిన అపార్థాలను బయట బెట్టి, గ్రీకు సంస్కృతి యొక్క అంతర్గత రమ్యాత్మను బయటకు వెలువరించి తేజోవంతము చేసినాడు. సంస్కృతి చరిత్రలో ఇట్టి కుచేష్టాజనిత వికృత పరిణామం తరచుగా మనకు కనబడుతూనే ఉంటుంది. ఇట్టి దురదృష్ట కాలంలో ఉన్నతోన్నత ఆధ్యాత్మిక కళావిలసనాలు,దుష్టవాఖ్యాన తిమిరంలో క్రింద చేయబడి పరిభవింపబడుతూనే వస్తున్నవి. రసికమణి మొదలియారు ఈ రెంటిని ఒక పునీత చూపులో పోల్చి చెప్పుట సముంజసంగా సహేతుకంగానే ఉన్నది. అనాగరక ఆటవికుల చేతులలో బడి రూపరి యుండిన నాగరక కళా విజ్ఞానాలను అగస్త్యుడు ఉద్ధరించి, పునఃప్రతిష్ఠ గావించియుండును, ఇదే దివ్యుల

కోరిక పై ఆయన సముద్ర జలాల దిగ్రావి, మరల ఉమియుటగా ఉత్ప్రేక్షింపబడి యుండవచ్చును. అగస్త్యుడు ప్రాచీన విజ్ఞానానికి గావించిన పునర్వ్యశదీకరణ—సంశోధనసేవలే ఇట్లా రూపకల్పన చేయబడి ఉండవచ్చును.

తరువాతి పాటలోగూడ కంబరు అగస్త్యుని ఆధ్యాత్మిక శ్రీవిలసనమును దృష్టాంత రూపంగా చెపుతున్నాడు. సాయుజ్యమార్గాన్ని గోరే అద్వైత వాదులు అగస్త్యుని దరిసి, ఆసక్తితో—"దేవుని దగ్గరకు చేర్చగలిగిన సులభ మార్గమేది?" అని అడిగినప్పుడు, ఆయన నోటితో ప్రత్యుత్తరం చెప్పక, మనసుకు నచ్చేటట్లు ఒక ప్రదర్శనమును చూపినాడు:—

నభచుంబియై తేలియాడే మేఘావళిని
దండవలె ధరించిన ఆ మాయా మహీధరంపై
అగస్త్యుడు కాలూని పైకి ఎగబ్రాకినాడు;
వెంటనే ఆ కొండ క్రిందికి దిగజారిజారి,
చివరకు అధోలోకం చేరినది;
అప్పుడు ఆయన ఆ కొండపై
యోగమహత్వ విలసితమైన వేదండమువలె
నిలబడినాడు!

ఈ నిరూపణంవల్ల, ఆధ్యాత్మిక పరిణామంలో కీలక సమస్యను పరిష్కరించే విధానాన్ని అగస్త్యుడు పృశ్ఛకునికి మనసు కెక్కునట్లు తెలియ పరచి ఉండవచ్చును. దేవునికి మానవునికి మధ్యనున్న అవరోధం— మానవుని అహంకారమే! దీనినే కంబుడు – అభ్రభేదియైన బ్రహ్మాండ మాయా పర్వతమన్నాడు. ఈ పర్వతం ఊహాజన్యమైనప్పటికిని, మానవుని బుద్ధి కల్పించిన దురారోహమైన అవరోధాలలో ఇది పెద్దది. దీనిచుట్టూ లోభ క్రోధ భ్రాంతి రూపములైన అజ్ఞాన మేఘాలు దట్టంగా అలముకొని ఉన్నవి. సాధకుడు ఈ అజ్ఞాన పర్వతముపై దృఢంగా కాలూని అణచి వేసిన ఉత్తర క్షణంలోనే అతడు దైవసాక్షాత్కారాన్ని పొందుతున్నాడు. ఈ నిగూఢ సాధన క్రమంలో, హఠయోగంలోవలె దేహ క్లేశ మనుభ వించవలసిన అగత్యం లేదు. కాబట్టే, అగస్త్యుడు బాధారహిత దైవాన్వేషక మార్గమని దీనిని అభినుతించి ఉన్నాడు.

అగస్త్యుని గూర్చిన ఇంకొక పురాణగాథను కంబకవి ప్రస్తావిస్తున్నాడు:—బహుశః ఇది భౌగోళికంగా దక్షిణభారతంలో సంభవించిన సంక్షోభంపై ఆధారపడి ఉండవచ్చును. పార్వతీ పరమేశ్వరుల వివాహం హిమాలయ సానువులలో జరుగబోతున్నది. మానవాళి అంతా ఆ పెండ్లి చూడను అక్కడకు చేరి గుంపుగట్టినది. కని విని ఎరుగని ఈ భారం భరించలేక, భూమి ఓరగిల జొచ్చినది. వెంటనే పరమశివుడు, వామన రూపుడైన అగస్త్యుని దక్షిణానికి త్వరగా పొమ్మని అర్థించినాడు. ఆయన దీనికి ఇయ్యకొని పొదిగైమలకు చేరినాడు. వెంటనే అగస్త్యుడు పడికట్టు తూకమై, క్రిందికి క్రుంగిపోతున్న హిమాలయాలను పైకి ఎత్తించగా, రెండు భుజాలు సరితూకమై అట్టే నిలిచిపోయినవి. ఈ పౌరాణిక తులలో తూచబడినది జనసంఖ్య గాదు– విలువలు! అగస్త్యుని సాంస్కృతిక శక్తి విలువ, శివుని, సర్వమానవావళి విలువతో సరిపెట్టబడినది. ఇది తెంపిరితనమే కావచ్చును.

ఇట్టి అద్భుతమైన పాండిత్యము, అపూర్వ ఆధ్యాత్మిక శక్తి గలిగిన ఈ మహర్షి భక్తి వినమ్రతలతో, ఆ రాముని తన ఆశ్రమంలోకి తోడితెచ్చేదానికి గబగబా ఎదురేగినాడు. అప్పుడే రాముడు ఆ ఆశ్రమోపాంత భూమిలో అడుగిడినాడు. అగస్త్యుడు వేగిరపాటుతో ముందుకు సాగిపోతూ, రాముని ఆగమనంతో, తాను ఇంతవరకు చేసిన తపస్సంతా పరిసమాప్తికి వచ్చి ఫలోన్ముఖమైనదని భావించుకొన్నాడు. రాముడు దాల్చిన మానవాకృతిలో దేవదేవుని దివ్యరూపాన్ని చూడబోతున్నానన్న భావంతో పులకితగాత్రుడై, ఆనందవివశుడై ఇట్లా అభినుతిస్తున్నాడు:—

నాదపూర్ణములైన నాలుగు నిగమములను
మిగత శ్రుతు లన్నిటిని –
బ్రహ్మదేవుడు భూరివిజ్ఞానమనే కల్వంలోవేసి,
ఏండ్లు పూండ్లు నూరి సారందీసినా,
ఆ మూలసత్యాన్ని కనుగొనలేకపోతున్నాడు!
కాని, అట్టి అజ్ఞేయతత్త్వము ఇంద్రియ గోచర
రూపం దాల్చి,
ఇప్పుడు ముఖాముఖి నాతో
సంభాషించను విచ్చేసి యున్నది!

అని ముదమందినాడు. ఈ మహాకవి ఆ మహాభాగుల సమావేశాన్ని అద్భుత గీతంలో వర్ణిస్తున్నాడు :—

అరుదెంచిన ఆయత బాహుడు
నిశ్చలంగా నిలిచి ఉన్న
ఆ మూర్తి పాదముల కెరగినాడు.
దక్షిణ దేశమండలి
శాశ్వత సజీవ తమిళ భాషలో
గీతముల బాడి అమరత్వమును బొందిన

ఆ ఋషి—

ప్రేమపూర్వకంగా ఆయన కరములబట్టి
ఆనందాశ్రులు నేత్రాలనుండి మాకుతుండగా
ప్రేమార్ద్రమైన స్వాగతవచనాలు పలికినాడు!

రాముని రాకను, అగస్త్యమున్యాశ్రమంలో ఋషులు ఆనందోత్సవంగా జరిపినారు. రాముని గౌరవార్థం ఒక పెద్ద విందు చేయబడినది. భోజనానంతరం, అగస్త్యుడు రాముని తన పర్ణశాలలో విడిది చేయమని కోరినాడు. అంత రాముడు దుష్టసంహారం గావించి, సజ్జనులను రక్షింతునని ప్రతినబూని, రాక్షసగణాన్ని మార్కొనను అనువైన ఒక రక్షకస్థానాన్ని అక్రమించుకోవలసి యున్నందున, అట్టి దుర్గం చేరుటకు ఆ ఋషీంద్రుని అనుజ్ఞనను రాముడు కోరినాడు. ఈ వ్యూహానికి అగస్త్యుడు అంగీకరించి, చాలా ఏండ్లుగా తన పూజామందిరంలో భద్రపరుపబడి యుండిన శివధనుస్సును-అక్షయ తూణీరమును రాముని కొసంగినాడు. వాటితోగూడ, ఆకాశవర్తులైన భూరి పురత్రయాన్ని శివుడు ధ్వంసం చేసిన ప్రచండ బాణాన్ని గూడా ఆ రామునికి బహూకరించినాడు. ఈ కానుకల బెట్టి, గోదావరీ నది జన్మస్థానమైన పంచవటిలో ఆవాస మేర్పరచుకోమని హితము చెప్పినాడు. అగస్త్యుని నోట, పంచవటి నెలకొనియున్న ఆ ప్రదేశ ప్రకృతి సౌభాగ్యాన్ని-నేత్రపర్వ దృశ్యాన్ని కన్నులకు గట్టునట్లు-కవి-వర్ణింపజేస్తున్నాడు:—

నిట్రంగా పైకి ఎదిగిన చెట్లు,
వాటికంటె ఊర్ధ్వగాములైన వెదురు జొంపాలు,

హాటికంటె ఇంకా పై కెగ్రాకిన
కొండ కొమ్ములు;
పార్శ్వ భూములలో ముందుకు నెట్టుకొని వస్తూ
ఊయ్యల లూగుతూ చెలిమి సలుపుకొంటున్న
పూగుత్తులతో నిండిన చెట్ల తోపులు చలువలీనుతూ
హాయి నిస్తుంటవి.
మంద మనోజ్ఞ ఊర్మికలు నేస్తమాత,
ఒక కొండవంక మృదుల నాదంతో
ప్రక్కననే జాలువారి సాగిపోతుంటుంది
వత్సా, అట్టి పవిత్ర పరిసరాలలో
పంచవటి మీకు సుఖావాసంగా అమరి ఉన్నది.

ఈ రమ్య వర్ణనలతో, యోగిపుంగవుడు ఆ మూర్తిత్రయానికి వీడ్కొలిచ్చి సాగనంపినాడు. ఆ ముగ్గరు అగస్త్యుని ఆశీస్సులు తలదాల్చి, ఉత్తరాభిముఖులై పంచవటికి బయలుదేరినారు.

ఎంతో దూరాభారం వారు నడచినారు,
మనసుకు హాయినిచ్చే తీరైన
వాగువంకల దాటినారు;
కొన్ని అణగిన, కొన్ని తలలెత్తిన
పర్వత శ్రేణుల అధిగమించినారు;
మరికొన్ని భూధరాలు వారికి ముందు
బంతిగట్టి సాగిపోయినవి;
ఇంక కొన్ని వారిని చుట్టుముట్టి,
సంకుల సమ్మర్దం గావిస్తూ కూర్చున్నట్లుండినవి.
ఇట్లా వారు నడచి నడచి, దూరాన
పక్షిరాజు—జటాయువును గాంచినారు.

## తల్లి పులుగు

ఆ దుర్గమ నగశ్రేణినుండి, ఒక నల్లటి కొండ ముందుకు పొడుచుకొని ఉన్నది. అందుండి మొనదేలి ఒక శిఖరశీర్షము ఉన్నది.

అక్కడ – ఆ కొండ కొన కొమ్మన జటాయువు–గృధ్రపతి కూర్చొని ఉన్నాడు.

మితభాషియైన వాల్మీకి, జటాయువును ఒక పెద్ద మఱ్ఱిచెట్టు కొమ్మ మీద కూర్చుండబెట్టి, అతడు బలాన్వితుడైన భూరికాయుడు – అని మాత్రం చెప్పి, అతని రూప వర్ణనాన్ని ఎక్కువగా చేయలేదు. పోతే, కంబుడు తన గొప్ప వర్ణనాశక్తిని, సుస్పష్ట చిత్రీకరణ సామర్థ్యమును ఆ పక్షిరాజుపై కురిపిస్తున్నాడు. మున్ముందు ఈ ఖగేశ్వరుడే సీతా సంరక్షణార్థం తన ప్రాణాలనే ఒడ్డి కోల్పోవుటను మనము చదువగలము. లలితకళా పరిపూర్ణుడు–విద్వత్సాగరమున సుస్థిరుడై నిలిచి ఆయత్తమతుడై ఉన్నవాడు–అకళంకుడు – సత్యనిరతుడు – సునిశిత ప్రజ్ఞాపాటవం గలవాడు – ఈ పక్షిరాజు, పరిపక్వమైన రాజనీతి చతురుడువలె, తన చిన్న కండ్లతో, ముందు చూపుతో దీర్ఘదర్శి అగుతున్నాడు. వాల్మీకి రామాయణంలో, జటాయువు, తాను దశరథునికి మిక్కిలి కూర్చు నేస్తగాడుగా రామ లక్ష్మణులతో చెప్పుకొంటూ, తన్ను తాను పరిచయం చేసుకొంటాడుగాని, వారి తండ్రి సంగతిని గూర్చి ఒక్కమారైనా అడుగడు. ఇక కంబకవి అయితేనో, దశరథుని యోగక్షేమా లడిగి, ఆ మానవుడు – ఆ పక్షి మధ్య పెంపొందిన సద్భావ ప్రేరక స్నేహాన్ని కరుణారసపూర్ణమైన ఒక శోకగీతంలో వర్ణించి ప్రస్తుతించేదానికి మంచి అవకాశం కల్పించుకొన్నాడు. దీని ఫలితంగా, పాఠకుని భావఫలకంలో జటాయువు సన్నిహితుడై – ఈ నాటకీయతా సానుభూతివల్ల పాఠకుని సరసభావము గట్టిగా జటాయువుతో పెనవేసుకొంటున్నది.

జటాయువు, నిజభూరి విశాల పక్షచ్ఛాయలక్రింద ఆ ముగ్గురిని పంచవటికి నడిపించినాడు. కొంత దూరం పోగానే, అగస్త్యుడు వారి ఉనికికి నిర్దేశించిన చోటును చూపి, చుట్టుపట్ల బాగోగులను చూడను ఆ పులుగురేడు ఎగిరిపోయి చూచి తిరిగి వచ్చినాడు. రామ లక్ష్మణులను తన పుత్రులుగా, ఆ సువర్ణగాత్ర–జానకి తన నెయ్యంపు కోడలుగా భావించి, వారి రక్షణకుగా, ఆ పరిసరాలలో రాక్షస నివేశాలు ఎరిగినవాడైనందున, పైపైన ఎగురుతూ వారికి కావలి గాస్తుండినాడు. మానవ స్వభావమునందుండి బయటబడు నేర్పు కంబునియందు అసాధారణమై వెలుగొందుచుండును. జటాయువు యొక్క సుకుమార హృదయ కుహరంనుండి ఇప్పుడు ఆ ముగ్గురిని ఉత్కంఠపూర్ణదృష్టితో వీక్షిస్తూ ఈ పలుకులు పలుకుతున్నాడు :—

గూటిలో నున్న రెక్కలురాని పిల్లలను
తల్లిపిట్ట మాటిమాటికి వచ్చి
చూచి పోతుండినట్టు
జటాయువు ఆ ముగ్గురిని
చూచి కాపాడుచుండినాడు.

ఇట్టి నేర్పుతోనే కంబుడు, ఈ ఊహాపరికల్పిత పౌరాణిక పాత్రకు జీవము అనురాగము ఊర్జితము కల్పించి, మానవుడు-పక్షికి మధ్య గల అంతరమును పోకార్చి, రెంటినీ కలిపివేస్తున్నాడు.

## శూర్పణఖ వికృత ప్రణయము

సీతారాములు ఆ రామణీయక పరిసరాలలో ఆనందంగా కాలం గడుపుతున్నారు. ఇంతలో ఒక నూతనాగంతుని వారి జీవితపథంలో బల వంతంగా అడ్డం దూరి, కథా సన్నివేశాలకు భిన్నపరిణామలను కలిగించినది. రావణుని కడగొట్టు చెల్లెలు-శూర్పణఖ అనే రాకాసి, ఆ పంచవటి ప్రాంతం అంతటిలో తన ఏలుబడిని అడ్డంలేకుండా సాగించుకొంటున్నది. క్రూర విధి పన్నాగం పన్ని, ఆమెను రాముడున్న చోటుకు పంపినది. రాముడు రాక్షస కుల నిర్మూలనానికే జన్మించినాడు. ఈ ప్రయోజన సాఫల్యానికిగా-రామునికి సహాయపడనే శూర్పణఖ రాక్షసవంశంలో పుట్టినదని కంబుని మతం. కాబట్టే వారిద్దరి సమాగమం, ఈ ఇతిహాసంలో గురుతరార్థం కలిగి ఉన్నది. శూర్పణఖ చూపులు రామునిపై పడగానే, అట్టి చిత్తాకర్షక శక్తిని ఇంతవర కెన్నడూ చూచియుండలేదని ఆమె మనసుకు తట్టినది. వెంటనే ఆయనపై ఉన్మాద ప్రేమలో పడిపోయినది. అట్టి కుసుమపేశల సౌందర్యమూర్తి, తన జీవితాన్ని భోగాన్వేషణంలో వినియోగింపక, ఇట్టి కర్కశ వ్రతపాల నంలో చిక్కి కృశించి మ్లానమై పోనేల-అని ఆశ్చర్యపడిపోయినది. తనలో తాను అనుకొంటున్నది :—

"తపము, ఈ మనోహరమూర్తిని
తప మాచరింపజేయను
ఎట్టి తపమాచరించినదో గదా!"—అని

వాల్మీకి శూర్పణఖ, కామాతురపువేడిలో, తన ఎఱ్ఱ చింపిరి వెంట్రుకలను, బానకడుపును, రోతబుట్టించే ఒంటితీరును, రాముని దరిసేదానికి ముందు మార్చుకోలేకపోయినది. మాయావిని అయిన కంబుని శూర్పణఖ, తనకు సిద్ధి అయిఉన్న మంత్రబలంతో రాముని ఎదుట నిలిచేదానికి ముందే, ఒక సుందర రూపాన్ని దాల్చినది. ఆ రాక్షసి ఒక బీజాక్షర మంత్రాన్ని జపించినది. వెంటనే రాకాశశి కాంతిపుంజాలను క్రిందుచేసే మోమును, సౌందర్య లావణ్య రూపమును దాల్చినది. ఇక్కడ కంబుడు లయబద్ధ మూర్ఛనలతో నిండిన ఒక పాటలో శూర్పణఖను ప్రవేశపెడుతున్నాడు—

మిరుమిట్లు గొలిపే ఒక చీరను ధరించినది. ఆ చీర పెద్ద చెరగులు క్రింద జీరాడుతున్నవి. మయూరి ఒయ్యారి నడలతో మెత్తగా మెల్లగా చిత్తాకర్షక అంగవిన్యాసంతో ఆమె రాముని సమీపించినది! ఆమె మేని కుందనపు చాయ – దానదీక్షాపరతంత్ర అయిన ఆ కల్పకతరు తరుణ కిసలయ మసృణతకు సాటియై ఉన్నది. ఆమె ఎఱ్ఱని పెదవులగుండా కామోద్దీపక మధువు బొట్లు బొట్లుగా కారుతున్నది. ఆవాతెర లోపల దేదీప్యమాన మౌక్తిక మాల ఒకటి వెలుగొందుతున్నది. లజ్జావతి అయిన హరిణేక్షణాలను ఆ రాక్షసి తనకు తానుగా ప్రసాదించుకొని ఉన్నది. మూల తమిళ గీత మందలి సమ్మోహన శక్తినంతా ఈ అనువాదంలోనికి దించలేకపోవడం సంతాపకరము. ఈ కవి ఒక నర్తకి దివ్యనృత్యలాఘవమును గొప్పనేర్పుతో కవితావస్తువుగా ఉపయోగించి యున్నాడు. ఈ పద్యంలో దృష్టి గోచర మద్యే సౌందర్యము, తరువాతి పద్యంలో కర్ణగోచరమవుతున్నది. శూర్పణఖ ధరించిన మంజీరారావము, మొలనూలు చిరుగంటల మ్రోత – హార నిక్వణము – కురులలో ముడిచిన విరుల వెంటబడే తేటిగుంపు రొదలు, పోటీ పెట్టుకొని నినదించే ఈ ధ్వనులన్నీ ఒక ఇంతి రాకను వెల్లడించినవి.

ఈ కవి, ప్రేమనుగూర్చి వాస్తవిక దృష్టితో గాఢాసక్తితో వర్ణించ గలిగిన ప్రజ్ఞ కలిగియుండినప్పటికిని ఇక్కడ శూర్పణఖ వికృత ప్రేమను సూక్ష్మ హాస్యరసపాకంలో చాలా పద్యాలలో వర్ణించి చెపుతున్నాడు. రామునిచే ప్రణయవిఘాతమునొంది ఆపె, గడ్డగట్టిన పిండిమంచును చేతులతో త్రవ్వి ఎత్తుకొని, కూచిదేలిన తన ఉడుకు రొమ్ములపై మెత్తికొన్నది. కాని, సలసలకాగే రాతిమీద వేసిన వెన్నవలె అది క్షణంలో కరిగి

పోయినది. ఇట్లా ఆమెను వలపు వెకిలిచేష్టలు పడనిచ్చి పడనిచ్చి, చివరకు లక్ష్మణుడు ఆ దానవి ముక్కు చెవులు నిక్క చనుమొనలు గోసి, కురూపిని జేసినాడు. మృత్యుదేవత ఆజ్ఞచే రాక్షసకుల నాశనాన్ని చాటే ఒక ఘోరి ఢంకా నినాదంవలె ఆపె పెద్దపెట్టున ఎలుగెత్తి ఏడ్చినది.

శూర్పణఖ రావణుని రాజవంశ సంజాత; రాక్షస సామ్రాజ్య ప్రభుత రక్షణలు ఆమెకు అండగా నున్నవి. ఆమె ఇతరులను బాధించుటే గాని బాధింపబడి ఎరుగదు. అట్టి వనితను ఒక సామాన్య మానవుడు గర్వభంగం చేయడం ఆమె రాజకులీనతకు మహావమానం కలిగించినది. అట్టి అపరాధి శిక్షింపబడకుండుటేగాక, ఈ దుశ్చేష్టకు అతడు పొంగిపోవుచుండ - ఆ రాజాధిరాజు సహోదరి ఇట్లా ధరాపరాగంలో దొర్లాడుతున్నది.

ఖరుడు దూషణుడు అనే ఇద్దరు దైత్యులు రావణాజ్ఞచే ఆ పరిసరాణ్యా ...ను కాపాడుతుండినారు. ఈ పరాభవాన్ని విని వారు రామునితో పోరి, ఆయనచే మడసినారు.

## లంకాపురి

ఖరదూషణాదుల వినాశానంతరం శూర్పణఖ లంకాపురికి బయలుదేరినది. ఈ పట్టుననే, కంబమహాకవి రావణుని, రాజవైభవంతో కీర్తికాంతితో మనకు పరిచయం చేస్తున్నారు. ఉపశమన మెరుగని కలుషశక్తికి ప్రతీకమైన ఒక అతీత రాక్షసునిగా రావణుని కవి చిత్రించడంలేదు. రావణుడు ఉత్కృష్టుడు - శౌర్యోపేతుడు - ఆధ్యాత్మిక ఘనుడు - ఉదారుడు - పరోపకారి - సంస్కార పరిణతుడు. కాని, అతనిని నిలువెల్లా కలుషితం చేసేది - ఒకే ఒక దోషము! అది - ఔచిత్యమెరుగని కామాంధత్వము; అదే అతని పతన హేతువైనది. ఆయన ఆస్థానంలో మహారాజాధిరాజులు తలలపై కెత్తిన ముకుళిత హస్తాలతో, ఆయన ఎవరి ప్రక్క ఎప్పుడు చూపులు బరపునో తెలియక తదేక ధ్యానంతో ఆయన చుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నారు. దేవ గాయకుడు - తుంబురుడు, రావణుని బాహుబల వీర్యాన్ని మధురమనోజ్ఞ స్తుతి గీతాలతో ఆలపిస్తున్నాడు. నారదుడు, పునీత పూర్వ సాంప్రదాయిక సంగీత స్వచ్ఛతను పొల్లుపోనీయక, తన వీణాతంత్రులనుండి దివ్యగానాన్ని ప్రభవింపజేసి, ఆ అసురేశుని చెవులకు ఇంపుగూరుస్తున్నాడు. అట్టి అనంద

కోలాహల తరుణంతో, సమస్త సాగరాల మథించివేయగలిగిన ఝంఝా మారుత కోపోద్వేగంతో, వేగంతో శూర్పణఖ రావణుని పేరోలగంలోనికి వచ్చి పడినది. ఆ రభసకు వెంటనే ఆగానమంతా ఆగిపోయినది. రావణుడు, తన రాచపుట్టువు చెల్లెలిపై జరిగిన పరిభవానికి, అంగవైకల్యానికి మ్రాన్పడి పోయి, నిష్ఠురధ్వనితో:-"ఈ అత్యాచారం ఎవరి పని?" అని ఆమెను అడిగినాడు. ఆ అపరాధులపట్ల గాఢానురాగాన్ని పెంచుకొన్న శూర్పణఖ- "వారు మానవమాత్రులు, ఖడ్గాలు ఝళిపిస్తూ నా ముక్కు చెవులు చన్నులు గోసినారు. అయినప్పటికిని వాళ్లు కామదేవుని పోలిఉన్నారు. ఈ ఒక్క ప్రపంచంలోనే ఇద్దరు మన్మథులు ఒకే సమయంలో వెలసి ఉండగలరా?" అన్నది. తన అంగాలు ఖండించి పరిభవించిన ఆదోషులపై పౌరుష్యంచూపక ప్రశంసించిన ఆమె మాటలు అనుమానాస్పదాలై, రావణుని యోచనలోకి దింపినవి. కాని, చిత్తచోరకమైన సీత సౌందర్య వర్ణనంచేత చెల్లెలు, అన్న అనుమానాన్ని తప్పుడు త్రోవకు మళ్లించినది. అపకీర్తి కారణమైన రావణుని కామలాలసతను సందుజేసుకొని ప్రేరేపించి, సీతను అపహరించేటట్లు చేయాలని ఆమె ఎత్తుగడ. ఆ తర్వాత రామలక్ష్మణులను అడ్డంలేకుండా సొంతంచేసుకో దలచుకొన్నది. శూర్పణఖ చేసిన కామభోగేచ్ఛాప్రేరక మైన సీత సౌందర్యాభి వర్ణనము రావణుని హృదయంలో కామాగ్నిని గన గన మండించినది. స్మరతాపం కలిగించిన చిత్తభ్రమలో రావణుడు ఆ రాత్రంతా కంటికి కూర్కులేకుండా, సీతను సంపాదించుకొనే ఉపాయాలతో వ్యూహాలతో కాలం వెడలబుచ్చినాడు.

తెల్లవారకట్ల, దశవదనుడు తన మామ-మారీచుని పిలువనంపినాడు పగసాధింపుగా, సీతారాముల ఎడముచేసి, సీతను తాను ఎత్తుకొని పొయ్యే సదుపాయం కల్పించమని, రావణుడు మారీచుని పట్టీ బలవంతాన ఒప్పించి నాడు. మారీచుడు బంగారు జింకగా మారినాడు. నిజస్వర్ణకాంతులు దివిని భువిని వెలిగిస్తుండగా, ఆ హరిణము పంచవటీ ప్రాంతం చేరినది. రాముని పర్ణశాల అది దరిసేటప్పటికి, సీత అందుండి బయటకు వస్తుంటినది.

అసదు లేనడుము అల్లల నాడు చుండ
మృదుల పాద పాతములతో
ఆమె నడుస్తుండినది.

కోయని పువ్వులవలె నుండే మృదల హస్తాలతో
ఆమె పుష్పాపచయం
చేస్తుండినది.

దీని మూలపద్యంలో కంబుడు, సీత చారువపు విన్యాసంలో తన ఆత్మను సంలీనం చేసినట్లు కనబడుతున్నది. దాని ఫలితంగా సాలీడు పట్టు గూడువంటి లలిత కవితను అల్లుతున్నాడు. ఈ రంగంలో సీత లక్ష్మణునికి పని పెట్టకుండా రామునే-నిజ హస్తాలతోనే ఆ పైడి జింకను పట్టితెచ్చి ఇమ్మని ఉబ్బు మాటలు పలుతున్నది. ఈ ఘట్టపు కవితలో కర్కశ హల్లులకంటె మృదుల అచ్చులే ముందు మిగిలి మధుర రుతముల పుట్టిస్తున్నవి; అందుచేత యువతీజన విశిష్టమైన లాలిత్యగుణము ఏదో ఒకటి ఇందుండి ఆకర్షిస్తూ భాసిస్తున్నది. రాముడు ఆ జింకను వెంబడించగానే అది చెవులు నిక్కబెట్టి నాలుగు కాళ్లు ఎదరు ఒత్తి, చెంగలించి పేరెం వారినది. మనోవేగాల వాయు వేగాల అధిగమించి, వేగానికి వేగం గూర్చినట్లు అది పరుగెత్తినది. కొండచరి యల కెక్కినది, మబ్బుగుంపులలో దూరినది; రాముడు అలసి నిలబడగానే ఆయన చేతి అందుబాటులోనికి వచ్చి నిలబడి తారికాడేది. నిలబడినట్లే నిలబడి కనబడి ఎంతో దవ్వుకు ఎగిరి దూకిపొయ్యేది. ఆశ బెట్టి ఎగబెట్టే దాని కొంటె చేష్టలు-పుష్పాలంకృత అయిన వెలయాలి నిలుకడలేని కూరిమి, పైడి ఆసతో పరుగెత్తినట్లుండినది. పాఠకుడు ఆ ఏణీ అంగవిన్యాసాలకు ముగ్ధుడై ఉండగా సందర్భోచితమైన వితాకు కలిగించే ఉపమానాలతో కవి, పాఠకుని ఇంకొక భిన్న వాస్తవికస్థితికి గొనిపోయి, కాసుకు కామాన్ని అమ్ముకొనే ఆ దుఃఖ భాజన ఉల్లాసినీ మానసికసంచలనాన్ని చూపిస్తున్నాడు. రాముడు ఆకువలె నుండే ఒక వాలమ్ముతో ఆ మాయా మృగాన్ని ఏసినాడు. వెంటనే ఆ ఇద్రి రాముని గొంతుచో, రక్షించమని అరచి క్రిందబడి అసువుల బాసినది. ఇప్పుడు రాముడు ఈ దుప్పి ఇంకొక పెద్ద కుట్రలో భాగమని గ్రహించు కొని, ముందే లక్ష్మణుడు ఎచ్చరించిన మాటను మనసుకు దెచ్చుకొన్నాడు.

## సీతాపహరణం

ఆ కృత్రిమ ఆర్తనాదంవల్ల సీత వంచింపబడి, రాముడు ఆపదలో ఉన్నాడని భావించినది. ఆమెను ఒంటరిగా విడిచిపెట్టి పోను ఇచ్ఛగింపని

లక్ష్మణుని నిష్ఠురోక్తులాడి రామునికి సహాయంగా పంపివేసినది. రామలక్ష్మణులు ఇద్దరూ లేని ఆ తరుణంలో, రావణుడు ఒక వృద్ధ దుర్బల సన్యాసి రూపంలో పర్ణకుటికి వచ్చి, సీత నిలుచున్న గడ్డతోగూడ నేలను పెళ్ళగించి ఎత్తి, ఆమెను తన తేరుపై కూర్చుండబెట్టుకొని మింటి కెగసిపోయినాడు * సీత ఆక్రందనాలు జటాయువు చెవిలో బడినవి; వెంటనే ఆ పెనుపులుగు రావణుని ఎదుర్కొని మెండొడ్డినది. ఆ పక్షి – ఆ రాక్షసులమధ్య దారుణ సమరం జరిగినది. ఆ పోరులో, రావణుడు తన ఖడ్గంతో జటాయువు రెండు రెక్కలను గూళ్ళలో నరకివేసినాడు. తోడనే ఆ పక్షి స్పృహదప్పి భూమిపై బడినది. ఆ సందులో రావణుడు త్వరత్వరగా తేరు తోలుకొని, సీతను లంకాపురికి తీసికొనిపోయినాడు. ఆమె పవిత్ర శరీరాన్ని తాకేదానికి భయపడి, రావణుడు అందమైన అశోకవనంలో ఆమెను చెరబెట్టినాడు. నల్లటి రాక్షస స్త్రీలను ఆమె చుట్టూ కాపుంచినాడు. ఆ స్థితిలో కవి సీతను వర్ణిస్తున్నాడు:

ఆ నల్లటి రాక్షస స్త్రీలమధ్య
సాంద్ర మేఘావళిని చీల్చివేస్తున్న
ఒక స్ఫురద్విద్యుల్లతా వలయంవలె
సీత ప్రకాశించినది!

ఇంతలోపల, దుర్నిమిత్తాలతో మనసు నిండిన రాముడు, అత్యంత వేగంతో పర్ణశాలకు తిరిగి వచ్చినాడు. వచ్చి సీతను కాననందున, పిడుగుపాటు తగిలినట్లు భ్రమాన్పడినాడు. తనువుబాసి, తిరిగివచ్చి, వెదకివెదకి తన కులాయమును కానని ఆత్మవలె నుండినాడు–రాముడు. ఆయన దిక్కుదెలియక, ఆ భూరిశరాసనము శరసమూహ భారతంతో అట్లే నిలబడిపోయినాడు. లక్ష్మణుడు ఒక తేరు గాలుజాడలను జూపినాడు: వెంటనే ఆ ఇద్దరు ఆ దారినబడి ఆర్తితో తూలుతూ నడచినారు. రాముడు కొంత దూరాన ఒక దారుణదృశ్యాన్ని చూచినాడు; మహావేగంగా అక్కడకు పోయినారు. అక్కడ జటాయువు ఒక నెత్తురు మడుగులో ఒళ్లు దెలియక పడిఉండుటను గాంచినారు. రాముని కండ్లనుండి కన్నీటి జడివాన కురిసి చూపును అడ్డగించినది.

* వాల్మీకి సంస్కృతంలో, రావణుడు ఎడమచేత సీత సిగబట్టుకొని, కుడిచేత తొడలు బట్టుకొని ఎత్తుకొనిపోయి రథంలో బెట్టుకొని పోయినట్లున్నది.

తోడనే ఆ పక్షి పునీతకాయం మీదబడి రాముడు సొమ్మసిలినాడు. లక్ష్మణుడు,ఒక మేఘ చుంబితనగ నిర్ఝరణీజలాన్ని తన దోసిలిలో పట్టితెచ్చి రాముని ముఖంపై చిలుకరించినాడు. రాముడు తెప్పరిల్లి, మదిని చిక్కబట్టుకొని, జటాయు గతికి వాపోవదొడగినాడు. ఆ ద్విజరాజులో చైతన్యం మెల్లమెల్లగా తెరలు తెరలుగా పొడచూపినది; కండ్లు తెరచినాడు. తనకు ఆపాదింపబడిన కళంకాన్నంతా తన ప్రాణార్పణంతో తుడిచివేసుకొన్నట్లు ముదమంది, రామ లక్ష్మణుల దర్శనంతో, నరుకుడుబడ్డ తన రెండు రెక్కలను మరల పొంది, సమస్త భువనాలు తనకు ప్రాప్తించినట్లు భావించి ఆనందించినాడు. దానవేశ్వరుని రత్నకిరీటాన్ని తునాతునకలుగా చేసిన చంచువులతో జటాయువు రామ లక్ష్మణులను పదేపదే ముద్దాడినాడు.

రావణుడు సీతను అపహరించుకొనిపోయిన విధానాన్ని రామునికి వివరించి చెప్పేదానికి జటాయు మొదట సంకోచించినాడు. త్రొక్కట పడి పడి, ధైర్యం తెచ్చుకొని, సీతాపహరణ వృత్తాంతాన్ని సూటిగా చెప్పక, రాక్షసులనే విషాంకురాలను పెరికివేసి సుజనావళికి మోదము గూర్చమని సూచించినాడు. ఆ పక్షి ఈ మాటలను తడబడుతూ చెప్పగానే, ఏదో ఒక రాక్షసుడు సీతను ఎత్తుకొనిపోయి ఉండునని, అడ్డంపోయిన ఈ పక్షిరాజు రెక్కలు వాడు నరికివేసియుండునని రాముడు తక్షణమే ఊహించుకొన్నాడు. దీనితోగూడ రాముడు కోపోద్రిక్త మానసుడైపోయినాడు. సమస్త భువనాలనే గాక, ఈ దురాగతాన్ని చూస్తూ ఊరకుండిన దేవతాగణాన్నే తుడిచివేతునని పలికినాడు. రాముని ఆ విమలమానసము జటాయువుకు దిగ్భ్రమ కలిగించినది. పట్టరాని ఆ కోపపు పొంగును ఉపశమింపజేసే దానికి జటాయువు ఒక పెద్ద ఎత్తు ఎత్తినాడు. పొడుపు మాటలు రాముని మనసును గాయపరచుననుకొన్నాడు. కాని, ఇవి చెప్పక తప్పినదిగాదు. ఈ మాటలే వాంఛిత ఫలదాయకాలని చివరకు నిర్ణయించుకొన్నాడు. "అసహాయ జానకిని అట్లా ఒంటరిగా వదలిపెట్టి ఆ మిరుమిట్లుగొల్పే జింక వెంబడిబడి, ఇక్ష్వాకు కులానికే అపకీర్తి తెచ్చినావు" అని రాముని తప్పుబట్టి "ఈ తప్పు నీది. అన్య ప్రపంచానిది కాదు" అని అనివేసినాడు—జటాయువు. ఈ వేడి మాటలు రాముని మనస్సుకు బాగా నాటి,ఆయన క్రోధస్థాయిని తక్షణం తగ్గించినది. "మహాశయా, ఆ రాక్షసుడు ఏ దారిన పోయినాడో చెప్పు" అని రాముడు

ఆతురతతో అడిగినాడు. అయన ఈ వాక్యం ముగించేలోపలనే, గద్దలరేడు తలదిమ్మతో మాటలుడిగి నేలగూలి పంచత్వాన్ని బొందినాడు.

వాల్మీకి జటాయు, సీతను అపహరించినది రావణుడని చెప్పివేసినప్పటికిన్నీ, కంబుడు ఒక నాటకీయ అనిశ్చితాంశాన్ని ప్రవేశపెట్టి, అపహర్త పేరు బయటపెట్టే లోపలనే జటాయు ప్రాణాలు బాసేటట్లు చేసినాడు. ఇంతేగాకుండా, రక్త హ్రదంలో పడియున్న జటాయువును చూడగానే, వాల్మీకి రాముడు – నరమాంసాశని అయిన ఆ క్రూరగృధ్రము సీతను చంపి చప్పరించి మ్రింగివేసియుండునని అనుమానించి, బాణం ఎక్కుబెట్టి అతనిని చంపనుద్యమించినాడు. ఆవ్యగ్రసమయంలో వాల్మీకి పక్షిరాజు, తన్ను చంపవద్దని రాముని ప్రార్థించి, సీతను ఎత్తుకొని పోతుండిన రావణునిని అడ్డగించి, సీతను కాపాడబోగా, ఆరాక్షసుడు తన్ను ఎట్లా వికలాంగుని చేసినది వివరిస్తాడు. ఇక కంబుని రామునికి జటాయువు పట్ల ఎంతో పుణ్యభావం దప్ప అన్యభావంలేదు, అందువల్ల రాముడు జటాయువును తన తండ్రి రూపాంతరంగా భావించినాడు. ఆ ఇద్దరి నడుమ పొడమిన సుకుమార బాంధవ్య రామణీయకత, వాల్మీకంలోవలె ఇక్కడ లేశమైనా వాసితగ్గలేదు. ఇట్టి మనోజ్ఞ మానవ ప్రకృతి పోషణమును ప్రదర్శించిన కంబమహాకవి నాటకీయ కళా వైదుష్యము జటాయువును, మరపురాని ఒక శాశ్వత పాత్రగా సృష్టించినది!

# 5

# కిష్కింధా కాండము

## సుగ్రీవ సమాగమనం

రామలక్ష్మణులు జటాయువుకు అంత్యక్రియలుచేసి, సీతను అన్వేషిస్తూ బహుదూరము పయనించినారు. వారి మానసములందు, దశరథుని స్థాన

మాక్రమించుకొనిన జటాయువు నిర్యాణంతో, ఆస్థానం శూన్యమే అయినది. నడచి నడచి వారు పర్వతారణ్యమైన కిష్కింధ చేరినారు. అక్కడ హనుమంతుడు అత్యంత సౌహార్ద్రంతో వారికి స్వాగతమిచ్చినాడు. హనుమంతుడు ఆ సోదరుల గాత్రసౌభాగ్యానికి సమ్మోహితుడై, వారు దివ్యాలయవాసులై ఉండాలని అనుకొన్నాడు. వారి దర్శన మాత్రం చేతనే ఆయనయందు ఒక నూత్న పరిణామం సంభవించి, ఆయన అవగాహనశక్తి పరిశుభ్రమై, ఈ భూతల వస్తుచయమంతా ఒక కొత్త అందపు తొడుపును అర్థమును పొందినట్లు అనిపించినది. వారి పాదస్పర్శచేత నిప్పులు గ్రక్కే రాతి పలుకులన్నీ చల్లారి, మధుపూర్ణ పుష్పవితానంగా మారినట్లు అనిపించినది. వారు ఏతట్టు పోయినా – తృణ వృక్షాదులన్నీగూడ బాగావంగి వినమ్రతతో వారికి గౌరవం చూపినట్లు ఉండినవి. "మీరు ధర్మదేవతలా ఏమి ?" అని హనుమంతుడు ఆశ్చర్యపడినాడు.

హనుమంతుడు పలికిన ఆ కొద్ది మాటలవల్లనే, ఆయన అత్యంత సంస్కారి అయిన వ్యక్తి అని, ఓజస్సు–మానసిక పరిపూర్ణత–విద్యాబుద్ధులు–స్థిరసంకల్పము – సహజవివేకము – ఇంగితజ్ఞానము, మొదలైన సుగుణ సందోహము, పెనవేసుకొని ఆయన యందున్నట్లు రాముడు వెంటనే కనుగొన్నాడు. నిజానికి హనుమంతుడు, నీతికి తోడునీడగా ఉండి దాని ఒంటరితనాన్ని బాపనే భూమిపై అవతరించినాడని కంబుడు వర్ణిస్తున్నాడు. కవిత్వ పదవాగురులకుగాని, వివిధ విద్యా సంయోగ మార్మిక జాలానికిగాని పట్టుబడని పరిపూర్ణత ఈ వానరశ్రేష్ఠుని రూపము దాల్చి భూలోకంలో ఉద్భవించినదని – రాముడు లక్ష్మణునితో అన్నాడు.

హనుమంతుడు వెంటనే, తన రేడు – వానరరాజు సుగ్రీవుని సన్నిధానానికి పోయి, రాముని పావన వంశమును ఆయన పరిత్యాగ మహాబుద్ధిని, ఇప్పటి దైన్య స్థితిని వివరించినాడు. ఆ మాటలతో సుగ్రీవుని మానసము ఆర్ద్రమైపోయి, తక్షణం రాముని చూడాలని తహతహ పడినది. తోడనే వారిద్దరు వంకరటింకరల కొండ దారినబడి వస్తూ, ఒక మలుపు తిరగానే, దూరాన కూర్చుండి ఉండిన రాముడు వారికంట బడినాడు. ఆ మూర్తిని చూడగానే సుగ్రీవుడు నిశ్చేష్టుడైపోయినాడు. చాలాసేపు రాముని అట్టే పరికించి చూచి: "దేవతాగణ ప్రభువు మానవాకృతిలో ఇట్లరుదెంచి

యున్నాడు; మానవుడై, మానవజాతి దేవగణమును జయించినదన్న సత్యమును నిరూపించి నిలబెట్టినాడు" అన్నాడు.

రాముడు, సుగ్రీవుని తన స్నేహితుడుగా సహాయకుడుగా ఆదరించినాడు. సుగ్రీవుని అన్న – వాలి, తమ్ముని భార్యను స్వాధీనం చేసుకొని, అతనిని వేధిస్తున్నాడని తెలిసికొని, వాలిని సంహరింతునని సుగ్రీవునికి రాముడు బాస ఇచ్చినాడు.

## ఏక్కటి కయ్యము

ఆ అన్నదమ్ములు – వాలి సుగ్రీవులకు ద్వంద్వ యుద్ధం ప్రారంభమైనది. చివరన వాలి గొట్టిన ప్రాణాంతకపు దెబ్బతోగూడ సుగ్రీవుడు క్రిందబడి సొక్కిపోయినాడు. ఆ క్లిష్టతరుణంలో, ప్రక్క పొదచాటుననుండి ఒక బాణం వచ్చి వాలి గుండెలో జొరబడినది. కొండవంటి అతని ఎదనుండి నెత్తురు ఊరి పెల్లుబికి బయటకు దూకి, మర్మరధ్వనులతో పడే ఒక జలపాతంవలె నినదించినది. ఈ రక్త దృశ్యం సుగ్రీవుని మనసును కదలించగా స్మారకం లేకుండా క్రిందపడిపోయినాడు; ఆయన నేత్రాలు ప్రేమాశ్రువులను క్రుమ్మరించినవి. బాణఘాతంవల్లను సాంద్ర రక్తస్రావం వల్లను వాలి నేలకు ఒరిగిపోయినాడు. దుర్భరమైన బాధచేత ఆయన, ఒక కోపాగ్ని పర్వతం బ్రద్దలైనట్లు బొబ్బరించినాడు. ఆ దారుణాస్త్రాన్ని తన గుండెనుండి బయటికి లాగివేస్తూ, "ఏదీ, దీనిని రెండు తుంటలు చేసివేస్తా" అని అంటూ లేచి నిలబడినాడు. తోడనే ఆ బాణంమీద ఒక పేరును చూచి దిగ్భ్రమ జెందినాడు! అదే శ్రీరామచంద్రుని పవిత్ర నామము! ఆ రామనామమే అనాది మూలమంత్రము: ముల్లోకాలకు ముక్తిదాయకము; దాని అప్రతిమాన జపమే స్వర్లోకానందలబ్ధికి హేతువు; జన్మజన్మాల సంచిత కర్మను ఇప్పుడే ఇక్కడనే పరిహరించే దివ్యౌషధము! అని ఆనంద తన్మయత నొందినాడు.

## రామునిపై దోషారోపణము

రాముడు పొదమాటు నుండి బయటకు వచ్చి ఈ కరుణామయ దృశ్యాన్ని చూచినాడు – నేలగూలిన వాలి గాయాల నుండి నెత్తురు కారుతున్నది. సుగ్రీవుడు ఇది చూడలేక నేల కొరిగి ఉన్నాడు. వీరాధివీరుడు–

మహాభక్తుడు – ఆ వాలి, రాముని జగన్మోహన విగ్రహాన్ని చూచినాడు. తన చావుదెబ్బ కంటె, రాముడు నీతిమార్గాన్ని తప్పినాడన్నదే వాలిని ఎక్కువగా బాధించినది. ఆయన రాముని ఉద్దేశించి అంటున్నాడు – "సత్య పాలనకుగా ప్రాణార్పణం గావించిన మహాపవిత్రుని పుత్రుడవు! అకళంకో దారుడైన భరతుని అన్నవు! నీ జీవితము కృపాతిశయానికి మాతృవత్సలకు ఉదాహరణంగా ఒప్పారు తున్నదే; పాపముల నుండి దీనులను రక్షించ వలసినవారే పాపానికి ఒడిగట్టుకొనిన, అది పాపము కాకపోవునా?" ఇట్లా చేసిన వాలి దోషారోపణానికి పోను పోను గతి, పారుష్యము ఎక్కువైనవి. రాముని అధీరకుటిలవర్తనమునకు తగినట్లుగా రకరకాల ఎత్తిపొడుపులతో, వక్రోక్తులతో ఒకే జడిగా నిందించినాడు. అందు విస్పష్టత యుక్తి ఛలోక్తి నిండి యుండుటచే దాని గుణము పెరిగినది. ఇంకా రాముని అడుగు తున్నాడు – "నీ భార్యను ఒక రాక్షసుడు అపహరించగా దానికి ప్రత్యా మ్నాయంగా, దానితో ఏ సంబంధముగాని లేని ఒక నిరపరాధిని – వానర పతిని తుదముట్టించ మని మనుధర్మశాస్త్రము ఆదేశించినదా? నీవే ఇట్లు అపకీర్తి అంబరమును కప్పుకొనగా, యశోవసనమును ధరించ యోగ్యు లెవరు?" మరి కొంత నెత్తురు కారిపోయినది; దీనితో వాలి సంయమన మును గాలికి దోలి నిష్ఠురంగా రాముని అధిక్షేపింపసాగినాడు:- బహుశః ఆ దివ్య మధురమూర్తి జానకిని పోగొట్టుకొన్నందున మతి చెడి తడబడినా వేమో! ఎంతటి బుద్ధిహీన కార్యం చేసినాడు! సూర్యదేవుని నుండి దిగి వచ్చిన రాముని ఇక్ష్వాకు వంశాన్ని గూర్తి ప్రస్తావిస్తూ వాలి అన్నాడు—— "నభోమండలాన్ని వెలిగించి తిరుగాడే చంద్రునికి ఒక నల్లటి మచ్చ దోషాం కంగా ఉన్నదని, అట్టి మచ్చనే నీవు సూర్యవంశానికి శాశ్వతంగా ఆపా దించినట్లున్నది. ఓ శూరమణీ, నీవు తుదముట్టించినది వాలిని కాదు, రాజ ధర్మాన్ని పరివేష్టించి రక్షించే సంరక్షక దుర్గభిత్తికనే నీవు నాశనం చేసి నావు". దీని తర్వాత వాలి కోపం ఇట్లా అగ్రస్థాయిని అందుకొంటున్నది:-

"ముఖాముఖిగ నిలువలేక
 దొంగ మాటున దాగి,
ఒక నిరాయుధ నిస్సహాయుని
 గుండె చీల్చను——

బాణ ప్రయోగం చేయుటకేనా
విలువిద్య సృష్టింపబడినది?
ఛీ! పరాంతఃపురం చేరిన నీ భార్య!
ఛీ! ఒక అపచేష్టజేసి
కలుషభూతమైన నీ పెద్ద కార్ముకము
ఎందుకు కల్పనా?''

## దైవసాక్షాత్కారము

వాలి రామునిపై మోపిన ఈ గురుతర నిందను సమర్థించే దానికిగా, సాంప్రదాయోన్మాద భక్తులు ఈ పాట తరువాత గల కొన్ని పాటలను అల్లి కంబరామాయణంలో దూర్చినా రనుట సహేతుకంగా ఉన్నది. ఈ సమర్థనాత్మకమైన పద్యాలలో కంబుని ప్రామాణికమైన ధ్వని లోపించి ఉన్నది. ఇవి పేలవంగా నమ్మబలుక లేకున్నవి. కవిత్వ విషయమున పొరపాటెరుగని సహజ జ్ఞానం గలిగిన – స్వర్గీయ, రసికమణి టి. కె. చిదంబర నాద మొదలియారు ఈ పద్యాలు కృతకములని సహేతుకంగానే త్రోసి పుచ్చున్నారు. ఆయన ఈ సందర్భమున ఈ ఊహా కల్పన చేస్తున్నారు: కంబుని రాముడు అరమర దాపిరికము లేకుండా, తాను చేసిన తప్పును ఒప్పుకొని ఉండవలెను. దానిపై తాను చాటు నుండి వాలిని చావు దెబ్బకొట్టి నందులకు ధైర్యంగానే క్షమాభిక్ష కోరియుండును. తన లోపాన్ని తాను అంగీకరించినందున రాముని దైవత్వంపై వాలికి విశ్వాసం కుదిరి, రాముని పట్ల గౌరవం ఎంతగానో పెరిగినది. సుగ్రీవుని అపార్థం చేసుకొనీ, అతనిని కారియపెట్టినట్లుగూడ వాలి తెలుసుకొన్నాడు. తక్షణమే వాలి, రాముని దైవత్వం గుర్తించమని సుగ్రీవునికి జెప్పి, ఆయననే తోడునీడగా మార్గదర్శిగా గ్రహించమని హితము చెప్పినాడు. ఇంతేగాకుండా, సుగ్రీవునికి రక్షణ నొసంగమనిగూడ రాముని అర్థించినాడు.

ఈపట్టున, వాలి కొడుకు – అంగదుడు గుండ్లు బండలు దాటుకొంటూ పరుగున ఒక కొండ దిగివచ్చి, అశ్రుపూరిత నయనాలతో మరణోన్ముఖుడైన తండ్రిపైబడి రోదించినాడు. అనువుదప్పి నేలమీద పడియున్న చంద్రునివలె నుండే వాలిమీద వియత్తలంనుండి జారిపడ్డ ఒక మెరుపు తీగవలె అంగదుడు పడినాడని కవి ఉత్ప్రేక్షిస్తున్నాడు.

కొడుకు తీవ్రావేదన తగిలి వాలి హృదయం స్పందించినది. దీనితో, పుత్రుని శిశురోదనాలు చాలించి – అప్రతిమానమైన ఆ పరమ సత్యసత్త్వము నిజపాద పద్మాలతో ఈ భువిపై నడుస్తున్నదని, నిజ కరకంజాలతో ఒక ధనువు ధరించి, ఇంద్రియ గోచరమైన దివ్యరూపాన్ని దాల్చి ఉన్నదని తెలుసుకోమని తనయునికి ధర్మోపదేశం చేసినాడు. ఇంకా వాలి అంటు న్నాడు:– "బిడ్డా, రాముడు ఒక దివ్యరసాయనము. ఇది మన సమస్త భవ రోగాలను మాన్పును. ఆయన ఆయా ఆత్మల పరిపాకావస్థను గుర్తించి, యథోచితంగా వాటిపై దయను కురిపించును. ఆయన దివ్యపాదారవిందా లను నీతలదాల్చి కృతార్థుడవు గమ్ము."

ఈవిధంగా చెప్పి, వాలి రామునివైపు చూచి:–"ఈ అంగదుడు ఒక చిచ్చు; రాక్షసులనే దూదిని కాల్చివేయ గలిగినవాడు, ఇదిగో! నీ అండన వీనిని వదలిపెట్టుతున్నా" అన్నాడు. అప్పుడే అంగదుడు రాముని పాదా లపై బడినాడు. రాముడు తన సువర్ణ ఖడ్గమును అంగదను వైపు చాచి – "దీనిని ధరింపుము" అని – అన అనకముందే, వాలి ఈ భౌతిక ప్రాణాన్ని పరిత్యజించి, అవలి ఊర్ధ్వ లోకాన్ని పొందినాడు.

పతిని పోగొట్టుకొనిన తారను ఓదార్చను శక్యంకాలేదు. ఆమె విలాప మును వర్ణించేదానికి కంబుడు అత్యంత నిష్ఠురపదాలను ఉపయోగిస్తున్నాడు. ఆ ఆక్రందనాలలో, తాను–వాలి, ఒకరి హృదయంలో ఇంకొకరు ఉంటున్నా రన్న లోకాపవాదాన్ని ఛిన్నంచేయను తార ప్రచండ తర్కమును ప్రయోగిస్తున్నది:—

సమరోత్సాహ భుజభూషిత ప్రభో!
నేను నీ హృదయవాసినే అయి ఉండినట్లయిన,
నీ హృదయాన్ని ఛిన్నం చేసిన సాయకము
నా ప్రాణాలనుగూడ ఊడ్చివేసి ఉండవలెను గదా?
నీవేగాన నా హృదయవాసివై యుండినచో
నాతోడ నీవునూ జీవించియే యుండవలసినవాడవు
కాబట్టి మనమిద్దరము ఒకరి హృదయంలో ఇంకొకరు
నివసించలేదు.

# 6

# సుందరకాండము

కంబమహాకవి, ఈ సుందరకాండను సీతాన్వేషణంతో ప్రారంభిస్తు న్నాడు. వానరదూతలు అన్ని దిక్కులకు పంపబడినారు. హనుమంతుడు సముద్రాల లఘించి సాయంత్రానికి లంక చేరుకొన్నాడు. ఆ నగరం ఒక మనోజ్ఞ దృశ్యాన్ని ప్రదర్శిస్తున్నది. హనుమంతుడు ఆ పుర హర్మ్యరాజి సౌందర్యానికి ఆశ్చర్యపడుచున్నాడు :—

ఆ పురి మందిరాలు –
సూర్యరశ్మితో నిర్మింపబడి,
విద్యుత్ప్రభలతో తాపబడినవా ?
లేక, పుటాలువేయబడిన
బంగారుతో చేయబడి
వజ్రమౌక్తికాలతో పొదవబడినవా ?
అవి నిజంగా దేనితో చేయబడినవో
తెలుసు కోవడం చాలా కష్టం
అహో .
ఆ పట్టణ గోపుర శిఖరాలు
భూరి ఘనపక్తిని ఛేదిస్తూ
చంద్రమండలాన్ని సదా తాకుతున్నవి !

## పాతివ్రత్యతా జ్యోతి

హనుమంతుడు సీతను వెదుకుతూ, ఒకచోటునుండి ఇంకొక చోటుకు క్రుమ్మరుతూ, చెక్కడపు పనితనంతో ఒప్పారే ఒక గవాక్షంగుండా ద్వారాల

గుండా తొంగిచూస్తూ ఉన్నాడు; కాని సీత ఎక్కడా కనిపించలేదు. నిరుత్సాహంతో పట్టణం వదలి అశోకవనం చేరి, ఒక చెట్టెక్కి దానిపై కుదురుకొని కూర్చున్నాడు. ఆ చెట్టుకు కొంతదూరాన ఒక బయలులో సీత కూర్చొని ఉన్నది. ఏవో తలుపులు ఆమె తలలో సుడిబెట్టుతున్నవి. ఒక నల్లటి మబ్బు తునకో, లేక చుట్టు ముట్టిఉన్న స్త్రీల కండ్లకాటుకో - ఏదైనా కావచ్చును, ఆమె మనసును కలగుండు పరచినది. ఎందుకంటే - అవన్నె ఆమెకు నల్లని రాముని జ్ఞప్తికి దెచ్చి ఉంటుంది. రాముడు కనబడునేమో అని, ఆశాపూర్ణ దృక్కులను దిగ్వలయమంతా త్రిప్పి గాలించి చూచినది. రావణుడు తన్ను అపహరించినాడని రాముడు తెలుసుకోలేదేమో అని అనుకొన్నప్పుడు, ఆమె మానసంలో ఆశ చోట నిరాశ చేరుకొనేది. ఆ రాముని మహిత గుణరాశిని తన మనోవీధికి దెచ్చుకొని, తాము ఇద్దరూ కలిసి పంచుకొన్న ఎన్నో మధురానుభూతులను తలచుకొనేది. తాను స్వయంగా పడవనడపి తమ్ము గంగను దాటించిన ఆ వేటగానితో - "ఈనా సోదరుడు నీ సోదరుడు, నేను నీకు సహచరుడను; ఈమె నీ వదిన" అనిని రాముని నేస్తపు మాటలను, ఆయన తరింపజేసే మైత్రిని తలచుకొని, సీత తీవ్ర వ్యాకులతతో క్రుంగి పొయ్యేది.

ఇట్లా సీత గత స్మృతి నిర్వేదంలో ఉండగా, హనుమంతునికి దృష్టి గోచరమైనది. ఇట్టి గాఢ దుఃఖార్తిలో నుండినా, ఆమె అచంచల పరిశుద్ధత - వినమ్రత - ఆమె మహనీయ వంశగౌరవములకు హనుమంతుడు ఆశ్చర్య పడినాడు. సీత సంతోషంలో ఉన్నప్పుడే రాముని నేత్రాలు ఆమె కమనీయ తను జూచి ఆనందించినవి. కాని, ఇప్పటి దుఃఖార్త సీత తన విశుద్ధతను మహత్వ సతీత్వమును అక్షతంగా కాపాడుకొనుటకు చేసే ఉగ్రతపస్సులో ఆ కమనీయత అంతకంటె వేయి మడుంగులు మనోజ్ఞంగా ఉంటున్నది. "ఈ మహిమోపేత దృశ్యాన్ని చూడను రాముని కండ్లు నోచుకోలేకపోవడం నిజంగా విచారకరం" అని హనుమంతుడు అనుకొన్నాడు.

ఈ సమయంలో సీత సమక్షంలోకి రావణుడు వస్తున్నాడు. అప్పుడు హనుమంతుని మానసం సంచలిత ఉద్విగ్నతలో అటు ఇటు ఉయ్యాల లూగినది. రావణుడు సీతకు గౌరవోచితమైన కొంత దూరాననే వినమ్రుడై ఏదో ప్రార్థించినట్లు నిలబడి ఉన్నాడు. ఆ అగ్నిని దరియను ఆ రావణుడు భయపడుతున్నట్లు హనుమంతుడు గ్రహించినాడు.

రావణుడు ఇనుమువంటి ధృఢసంకల్పము నిశ్చల మానసముగలవాడై నప్పటికిన్ని సీత ముందు ఈ పరుష గుణాలు మెత్తబడి పోయినవి. సీతతో ఆయన అంటున్నాడు :—

"ఈ ముల్లోకాల పౌరగణము
నాకు మ్రొక్కులిడు తున్నది;
అట్టి నేను, నీదాసుడ నగుతున్నాను
దయచేసి ఇయ్యకొనుము."

ఈ మాటలు వినగానే ఆమె కనులనుండి నెత్తు రుబికి దూకినది. రావణుని తట్టు చూడకుండానే కోపోజ్జ్వలితములైన ఈ మాట లంటున్నది:—

"మేరు పర్వతాన్ని భేదించవలసివస్తే
ఆకాశాన్ని చీల్చి దాటవలసివస్తే
ఈ ఏడేడు పద్నాలుగు లోకాలను
నాశనం చేయవలసి వస్తే
నా నాథుని బాణమే ఆపని చేయగలదు!
అన్నీ నేర్చిన బుద్ధిహీనుడా,
నీతిమాలిన మాటలనుటకేనా
నీకు పదితలలున్నది ?
నీ పది తలలు, నీ లెక్కకు మీరిన చేతులు
మా శరాసన పండితుడు
తన బాణాలను క్రీడార్థం ఎక్కుబెట్టను
చక్కటి గురియై యున్నవి.
నీ తపస్సుతో సాధించిన వరాలన్నీ
నీ దీర్ఘాయువు మొదలైనవన్నీ
ఆ మృత్యుదేవత - యమునినుండి
నిన్ను రక్షింపవచ్చును గాని,
నా వీరపతి బాణాఘాతం నుండి
నిన్ను రక్షింపజాలవు."

ఈ మాటలు రావణుడు వింటుండగానే, మన్మథశక్తికంటె అతని క్రోధాశక్తి అధిగమించినది. ప్రచండ కోపోద్రిక్తతతో అశోకవనం వదలి నిజాంతఃపురం చేరుకొన్నాడు. ఒక చెట్టు కొస కొమ్మన కూర్చుండియుండిన హనుమంతుడు, ఈ విస్మయజనక దృశ్యాన్ని చూస్తుండినాడు. పాతివ్రత్య జ్యోతి, అట్లా తరుగని కాంతితో వెలుగొందడం చూచి ఆయన ఆనందించినాడు.

అప్పటికి నడిరేయి దాకొన్నది. సీత ఎదుటబడే దానికి అదే తగిన అదనని హనుమంతుడనుకొన్నాడు. చెట్టునుండి దిగేతలికి, సీత చుట్టూ ఒక వలయంగా కూర్చొని ఉన్న అనేక రాక్షసాంగనలు కనబడినారు. జాగరూకతాదేవియే ఒకవేళ మైమరచి కనుగొరికినచో, ఆమెనే తట్టి మేల్కొలుప గలిగినంతటి జాగరూకతతో ఆ రాక్షస స్త్రీలు కావలిగాస్తున్నారు. హనుమంతుడు తన మాయాశక్తిని వారిపై ప్రయోగించి, మంత్రబద్ధుల జేసినాడు. దాని ఫలితంగా వారంతా గాఢనిద్రలో మునిగిపోయినారు. ఎప్పుడూ నిద్ర ఎరుగని ఆ రాక్షసులు నిద్రపోగా, పూర్తిగా ఏకాకిని అయిపోయిన సీతను భయదుఃఖాలు పట్టుకొన్నవి. ఎప్పటికైనా రాముడు తన్ను కనుగొనగలడో లేడో అన్న సందేహం ఆమెను పైకొన్నది. బహుశః ఆమెను రాముడు పరిత్యజించనే తీర్మానించుకొన్నాడేమో! తుట్టతుదకు మరణించుటే తన విధ్యుక్తమని నిర్ణయించుకొన్నది. ఈ మానసికావస్థలో సీత, ప్రక్కన ఆనుకొనియుండిన ఒక మాధవీలతానికుంజంలోనికి దూరినది ... ఆ క్షణంలో, ఆమె తలపెట్టిన పని ఊహించుకొనిన హనుమంతుడు, ఆమె దగ్గరకు పరుగెత్తి, అడ్డంగా ఎదుట నిలిచి కైమోడ్చి, తాను రామదూతనని తెలియజేసినాడు. సీత ఇది నమ్మలేకపోయినది. అప్పుడు ఆమెకూ – రామునికి మాత్రమే తెలిసిన కొన్ని సందర్భాలను ఆనమాళ్లుగా చెప్పి, హనుమంతుడు తనపట్ల సీతకు నమ్మకం కలిగించుకొన్నాడు.

రామునికి సీతపట్లగల ప్రేమాతిరేకమును – మార్దవమును తెలిపే ఈ విషయాలు ఆమెకు ఊరటను నెనరును తప్పకా కలిగించియుండును. తర్వాత రాముని పేరు చెక్కియుండిన ముద్రికాంగుళీయాన్ని ఆమె చేతబెట్టి– ''భద్రంగా దీనిని తీసికొనిపోయి సీతకు ఇమ్ము'' అని రాముడు చెప్పినాడని, హనుమంతుడు ఆమెతో చెప్పినాడు.

ఆ ముద్రికను చూడగానే, సీత ఆనందతన్మయ అయిపోయినది. మూర్కొని ముద్దిడి దానిని తన ఎదకు హత్తుకొన్నది. హనుమంతునితో అంటున్నది:- "ఓ సత్పురుషా, నీవు నాకు ప్రాణదానం చేసినావు. నా మానసమే నిష్కళంకమై ఉన్నచో, నీవు ఇప్పటి బలసత్వములతోనే చిరంజీవి అగుదువు. ఈ పదునాల్గు భువనాలు లయించిపోయిన తర్వాత గూడ, ఒక దివ్యయుగం ఒక దినంగా లెక్కపెట్టినా నీవు శాశ్వతంగా మనియుందువు" అని, ఆయన అంతటి చిన్న శరీరంతో అంత సముద్రం ఎట్లా దాటినాడా ? అని సీత ఆశ్చర్యపడినది. ఆ సందేహానికి ప్రత్యుత్తరంగా హనుమంతుడు విశ్వరూపం దాల్చినాడు. కనురెప్పపాటులో అతంతకు పొడవై పోయినాడు. ఆయన బాహువులు పైకి ప్రాకిపోయినవి. ఎదిగి ఎదిగి మింటి కప్పును తాకినాడు. ఇంకా పెరిగితే గగనోపరితలం తన తలకు తగులునేమో అన్న భయంతో, ఆ భూరి కాయాన్ని ముడుచుకొన్నాడు. ఈ అద్భుత ప్రదర్శనం సీత సంశయాలన్నిటిని తీర్చినది. ఇప్పుడు మది కుదుటబడి, భద్రతాభావం కుదిరినది. సీత ఆజ్ఞమీద హనుమంతుడు, తన పూర్వ రూపాన్ని దాల్చినాడు. తర్వాత - "నీ సత్తాకు తగినట్లు ఈ విరోధి లంక ఏడు సముద్రాల కావల ఉండకపోవడం నీ బాహుబల వీర్యానికి ఒక కళంకం కదా?" అని సీత హనుమంతుని నర్మగర్భంగా స్తుతించినది.

వెంటనే ఒక కమనీయ సంభాషణ ప్రారంభమవుతున్నది. ఇందు కంబకవి, సీత మనసును మట్టడించిన వివిధ భావావేశాలను వివరిస్తున్నాడు. చివరకు హనుమంతునితో - "నేను ఇక ఒక్కనెల మాత్రమే వేచియుందునని నా ప్రభువుతో చెప్పు. ఆలోపల ఆయన రక్షింపకపోతే, ఆ గంగానదీ తీరాన తన పవిత్ర హస్తాలతోనే నా అపర క్రియలు చేయుమని చెప్పు. ఇంకా - ఈ జన్మలో మనసుతోనైనా అన్యస్త్రీని ముట్టను - అన్న ఆయన పాణిగ్రహణ సమయ వ్రత వాక్యాన్ని ఆయనకు తప్పక జ్ఞప్తిచేయి" అన్నది. దీనికి హనుమంతుడు, సీత మానసాన్ని కదిలించి, నమ్మకం కలిగించే ప్రత్యుత్తర వచనాలు పలికి, ఆమె సెలవు దీసుకొని మరలినాడు. ఆయన బయలుదేరే ముందు, సీత తన చూడామణిని హనుమంతుని చేతికిచ్చి, పదిలంగా దానిని భర్తకు అందజేయమన్నది. హనుమంతుడు ఆమె దీవనలను పొంది, అశోక వనం నుండి బయటకు వచ్చి లంకాపురికి నిప్పంటించి, మరల సముద్రం ఎగిరి దాటి రాముని సన్నిధానం చేరుకొన్నాడు.

## హనుమంతుని ప్రత్యాగమనం

ఇక కవి, మన దృక్కులను రాముని పైకి ప్రసరింపజేయిస్తున్నాడు : సుగ్రీవుడు సీతను వెదకను వానరు లందరిని తలా ఒక దిక్కుకు పంపినాడు; తాను రాముని పజ్జనే ఉండి ఓదార్చి ఉత్సాహం కలిగిస్తుండినాడు. ఆయన తన పాప శంకలను వెలిబుస్తుండిన తరుణంలో, దక్షిణ చక్రవాళం ఒక వెలుతురు డాలుతో మెరిసినది. సూర్యుడు దక్షిణాన ఉదయించినట్లు హనుమంతుడు పొడచూపినాడు! ఆయన రాముని దరియగానే, రాముని పాదాలకు ప్రణామాలు ఆచరించకుండా, సీత ఉన్న దిక్కుకు మొగం త్రిప్పి, భూమిపై సాగిలబడి మ్రొక్కి, సీత స్తోత్రం ప్రారంభించినాడు.

"చూచినా! ఆమెను" అన్నాడు. "నా సొంత కండ్లతోనే ఆ పవిత్ర మణిని, ఆ సాగర ప్రక్షాళిత లంకాద్వీపంలో కనులార చూచినా. జగత్ప్రభో, ఇక మీ సంశయాలను సంతాపాలను పారద్రోలండి" అని హనుమంతుడు చాటినాడు.

సీత పాతివ్రత్య అకళంకతను గూర్చి హనుమంతుడు చేసిన గుణ కీర్తనమును రాముడు వినగానే ఆయన మానసం ఉప్పొంగిపోయినది. ఇక, ఆయనకు సీతా విమోచనం దప్ప అన్యమేమీ మిగులలేదు.

# 7

# యుద్ధకాండము

## లంకాపట్టణ పునర్నిర్మాణము

యుద్ధకాండం, లంకారంగంతో ప్రారంభమవుతున్నది. లంకను హనుమంతుడు కాల్చి నేల చదరంగా చేసిన తర్వాత, దానిని తిరిగి కొత్తగా కట్టమని రావణుడు ఆజ్ఞాపించినాడు. సృష్టికర్త - ఆ బ్రహ్మే నగర వాస్తు

రూపాన్ని తీర్చిదిద్దినాడు. స్వర్గశిల్పి – మయుడు దాని ప్రకారం కాలయాపన జరుగకుండా పురిని మరల కట్టినాడు. ఒక కోతి అంత నగరాన్ని నాశనం చేసినందుకు కించపడిన రావణుడు, నూతన నిర్మిత లంకాపురిని నాలుగు గవనులు తిరిగి చూచి, దహింపబడిన దానికంటె ఇదే అందంగా ఉన్నదని తెలుసుకొన్నాడు; దీనితో కోపాగ్నిని అణచుకొని ఆనందాన్ని అనుభవించి నాడు. నూతన సమావేశ మందిరంలో యుద్ధమంత్రి మండలిని సమావేశ పరచినాడు.

## యుద్ధ సమాలోచనలు

రావణుడు సింహాసనారూఢుడై, ఒక కోతి వికృతపు చేష్టలవల్ల తమ సార్వభౌమిక ప్రతిష్ఠ అట్లా బూడిద చేయబడుటను గూర్చి చెప్పగానే, ఒక భయంకర నిశ్శబ్దం దిగివచ్చి ఆ సభాంగణమునంతా అలముకొన్నది. సేనా పతులు ఒకరితర్వాత ఒకరు లేచి, తాము ఒక్కొకరుగానే యుద్ధంచేసి శత్రు నిర్మూలనం చేసే అవకాశం తమ కివ్వమని రాజును అర్థించినారు. ఈ సందర్భంలో, రావణుని తమ్ముడు – కుంభకర్ణుడు లేచి, సీతను అపహరిం చడంవల్ల రావణుడు నైతికాపరాధం చేసినాడని చెప్పినాడు. "సీతను విధ వను జేసి నీవు ఆమెను పెండ్లిచేసుకొనే అనువు కల్పిస్తాను" అని రావణు నితో చెప్పిన వాల్మీకి కుంభకర్ణునివలెగాక, కంబకవి కుంభకర్ణుడు ధర్మా ధర్మముల సూక్ష్మ విభేదములను బాగా ఎరిగి ఉన్నాడు. ఇది తెలిసిగూడా, తప్పుదారిన పడిన రావణుని కొరకు, అతనిపట్లగల భ్రాతృ ప్రేమతో తన ప్రాణాలనే అర్పించను సిద్ధంగా ఉన్నాడు.

రావణుని కడగొట్టు తమ్ముడు – విభీషణుడు దీనికి పూర్తిగా భిన్నమైన దృక్పథంలో ఉన్నాడు. ఆయన, ఆ ముగ్గురు సహోదరులలో ఎక్కుడు సంస్కారితుడేగాక, ధర్మరక్షణయిందు దృఢవ్రతుడు. ఆయన మానసిక ప్రవృత్తి ఎట్టిదంటే – జాతి వంశ ఆత్మాభిమానాలను ధర్మ సంస్థాపనోత్సా హంలో పరిత్యజింప గలవాడు. ఆయన నిలబడి రావణునికి కొన్ని నిష్ఠుర వాక్యాలు చెప్పినాడు:—"సర్వలోక జనని – ఆ సీత పాతివ్రత్యమే నీ కీర్తి ప్రతిష్ఠలను నీ రాజధానిని నేలగలిపినది. అట్లా అంతపని చేసి దహించినది కేవలమూ ఒక కోతేనని ఊహించుకోవద్దు" అని చెప్పి, సీతను కుదురుగా

ఆమె భర్తకు అప్పగించమని హితవచనాలు పలికినాడు. ఆ మాటలు రావణుని క్రుద్ధమూర్తిని చేయగా హట్టహాసం చేసినాడు. దిక్కులలో ప్రతిధ్వనించిన వాగ్ధోరణిలో రావణుడు విభీషణునిపై అవమానాన్ని అవహేళనాన్ని క్రుమ్మరించినాడు. కాని, ధర్మంమీద స్థిరంగా నిలబడి యున్న విభీషణుడు-రాముడు, నిజపూర్వావతారంలో నరసింహుడై ప్రచండ హిరణ్యకశిపుని తుదముట్టించిన ఉదంతం పేర్కొన్నాడు. తమ్ముని, అట్టి సానురాగపరితాప భాషణాన్ని విన్న రావణుడు, వెంటనే ఆయన విరోధి కుట్రలో చేరిఉన్నాడని ముందూవెనకలు ఆలోచించకుండానే నిర్ధారణ చేసుకొని – "ఇక లంక పరిసరాలలో తలచూపి తిరుగాడితే ప్రాణాలే పోగొట్టుకొందువు" అని భయపెట్టి, తమ్ముని తన రాజ్యంనుండి వెడలిపొమ్మన్నాడు. దుఃఖార్తుడైన విభీషణుడు – "సోదరా, నీ ఆత్మ క్షేమంకరమైన హితము చెప్పినా; కాని నీవు వినిపించుకోలేదు; ఈనా తప్పును మన్నించు" అని పలికి, లంకను విడిచి పెట్టి పోయినాడు.

## విభీషణ శరణాగతి

యోగ్యులైన నలుగురు రాక్షసులు వెంట నడువ విభీషణుడు సముద్రం దాటి, రాముని వానరసేన విడిచియున్న ప్రదేశానికి చేరుకొన్నాడు. ఎవరో ఒక రాక్షసచారుడు తమ మధ్య ప్రవేశింపనున్నాడని కొందరు వానరులు అనుకొన్నారు. రాముడు తన హితులతో మంత్రాలోచనం జరిపినాడు. హనుమంతుడు దప్ప మిగతవారంతా, ఆ స్వపక్షపరిత్యక్తుడు – ఆ విభీషణుని చేరదీసేదానికి వ్యతిరేకించినారు. సంశయాత్ములైఉన్న సుగ్రీవాది వానరుల తట్టు మొగమై రాముడు – "హనుమంతుని వాక్యాలు అద్భుతాలు. పదరచనౌచిత్యము – వాటి విస్పష్టత ఆశ్చర్యజనకాలు. మనం చచ్చినా బ్రతికినా, గెలిచినా ఓడినా ఒక లెక్కలోనివి గావు. మన శరణుజొచ్చిన వానిని ఆదరించి అంగీకరించవలసినది! విపత్తునుండి రక్షింపమని వచ్చి, శరణుజొచ్చిన వానిని త్రోసిపుచ్చినదే నా అవసాన దినము. శరణాగతుని ద్రోహచింతవల్లనే నేను మరణించినప్పటికిని, నాటినుండియే నేను శాశ్వత జీవినై యుందును.' అని పలికినాడు.

కంబకవి ఈ అవకాశాన్ని చేజిక్కించుకొని, దయామయమైన శరణాగతి ధర్మాన్ని రామునిచేత ప్రవచింపజేస్తున్నాడు. ఈ సూత్రానుగుణంగా,

భగవంతుడు తన అపార కరుణాతిశయంచేత అరమరలేకుండా సర్వసంగ పరిత్యాగియై, ఆయన శరణుజొచ్చినవాని సర్వపాపాలను తుడిచివేసి, అట్టి వానిని నిజానంద తత్త్వములోనికి సంలీనం చేసుకొంటున్నాడు.

రాముని ఆజ్ఞానుసారంగా, సుగ్రీవుడు విభీషణుని తోడితెచ్చేదానికి బయలుదేరి పోతున్నాడు. ఆ మొదటిచూపుతోనే ఆ ఇద్దరి పవిత్రాత్మలు కలిసి ఒకటైపోయినవి. తెల్లటి సుగ్రీవుడు నల్లటి విభీషణుని కౌగలించుకొన్నప్పుడు- కవి నిజవిశిష్ట సాహసోపేత కల్పనాచాతురితో – ఆ దృశ్యము, ఒకే సమయంలో రేయిబవలు కలిసినట్టున్నదని వర్ణిస్తున్నాడు.

అత్యంత భక్తిశ్రద్ధలతో విభీషణుడు రాముని సమీపిస్తున్నాడు. ఆయన చూపులు రామునిపై వాలగానే రాముని గాత్ర సౌందర్య సౌభాగ్యానికి మంత్రముగ్ధుడై పోతున్నాడు. అప్పటివరకు ధర్మాన్ని నిర్గుణతత్త్వంగా భావిస్తుండిన విభీషణుడు ఇప్పుడు రాముని చూస్తుండగానే ధర్మం సగుణ రూపమని భావించుకోకలిగినాడు. ఆయన దిగ్భ్రాంతిలో – "ధర్మపు మేని చాయ నలుపా?" అని ప్రశ్నిస్తున్నాడు. విభీషణుని అపారభక్తికి రాముని సంశయ రహితాత్మ ప్రతిస్పందించినది. వెంటనే తన సోదరుడుగా ఆయనను స్వీకరించినాడు. "గుహునితో మేము ఐదుగురు అన్నదమ్ములైనాము. తర్వాత సుగ్రీవునితో ఆరుగుర మైనాము. ఇప్పుడు ప్రేమపాత్రుడు – మిత్రుడవు అయిన నీతోగలసి మనము సప్తభ్రాతలమైనాము. ఈ అమూల్యాభరణ్యం నాకు దత్తంజేసి, యశోవిశాలుడైన ఆ దశరథుడు ఇప్పుడు బహుపుత్రవంతుడైనాడు" అన్నాడు – రాముడు. ఈ స్వీకారానికి వానరవాహిని ఆనందించింది.

సముద్రం మధ్య లంకకు ఒక వారధి గట్టను నలుడు అనే వాస్తుశిల్పి నియమింపబడినాడు. సుగ్రీవుని ఆజ్ఞప్రకారం, మర్కట మహావీరులు అన్ని దిక్కులకు ప్రాకి కొండలు గుట్టలు బండలు రాళ్ళు రప్పలు ఆమడ దూరంనుంచి మోసుకొని వచ్చినారు.

ఇక ఇప్పుడు భారతదేశాన్ని లంకను కలిపిన సేతువు పూర్తి అయినది. రాముడు సకల సేనాసమేతంగా ఆ వంతెనమీద దాటి లంక చేరుకొన్నాడు. రాముడు అంగదునిద్వారా, రావణునికి కడపటిసారిగా దౌత్య సందేశ మంపించినాడు. అంగదుడు తిరిగివచ్చి: "అతని మకుట భూషిత

మస్తకాన్ని తుడిచి, మొదనుండి వేరుచేస్తేనే గాని, సీతమ్మపై కోర్కెను తన మదినుండి తుడిచివేసుకోడు” అని తన దౌత్య ఫలితాన్ని రామునికి నివేదించినాడు.

## యు ద్ధా ర ం భ ం

తప్పింపరాని ఆయుద్ధ ప్రారంభమైనది! రాక్షస సైన్యాలు పొలికలనును నింపినవి; అట్లే వానర వాహినులుగూడ. ఒకరొకరితో తలపడబొయ్యే సమయంలో రావణుడు రణశిరసును చేరినాడు. తళతళ మెరసే ఆయుధాలు పట్టుకొనిన భూరికాయులు రావణుని తేరుచుట్టూ చేరి, పెద్ద పెద్దగా రణ నినాదాలు చేస్తున్నారు.

రావణుడు తానుగా రణరంగానికి వచ్చి, ఎదుర్కొనేదానికి అవకాశమిచ్చినందుకు రాముడు సంతోషపడుతున్నాడు. సీతా విరహతాపంచేత కృశించిన రాముని బాహువులు, ఇప్పుడు సంతోషాతిశయంతో ఉబ్బినవి

పోరు ప్రారంభమైనది. రావణుడు రథంపై నిలిచి పోరుతున్నాడు; రాముడు హనుమంతుని భుజాలమీద నిలబడి మార్కొంటున్నాడు. రావణుని బాణ పరంపర రాముని బాణాలచేత పొడిపొడి చేయబడుతున్నవి. రాముని శరక్రౌర్యం సహించలేక రాక్షసబలగం చెల్లాచెదరై అన్ని దిక్కులకు పరుగెత్తిపోయి, రావణుని తేరుపై ఒంటరివానిగా జేసినవి. రాముడు ఖడ్గధారలవంటి భూరిభల్లములను పంపి, రావణుని తేరు కీల్లూడగొట్టి తునాతునకలు చేసివేసినాడు. దీని తర్వాత రాక్షసేశుడు నేలపై నిలిచి శౌర్యోపేతంగా పోరాడుతున్నాడు. ఒక రామబాణం అతని విల్లును విరచినది. ఇంకొక్క నారాచము అతని ఖడ్గాన్ని తునియలు జేసినది. మూడవ శరము రావణుని తలపై కిరీటమును ఎగురగొట్టి తిరస్కారపూర్వకంగా దూరాన విసరికొట్టినది. ఇదే రావణుని జీవితంలో దుర్భర అవమానిత క్షణం! ఉక్కుచెడి, దీనుడై అధోముఖుడై, కాలివ్రేళ్ళతో నేలను రాస్తూ నిలబడి ఉన్నాడు. ఒక పెద్ద మర్రిచెట్టు ఊడలు నిర్వీర్యంగా నేలకు ఒరిగి వ్రేలాడుతున్నట్లు, రావణుడు వాడిన తన ఉత్తచేతులతో సొరిగి ఉన్నాడు.

రావణుని ఈ అసహాయ క్లిష్టస్థితిని సందు చూచుకొని, రాముడు విజృంభించ దలచుకోలేదు; దయాంతరంగుడై ఉదారబుద్ధితో రావణుని

ప్రాణాల అట్టిపెట్టి, మరలిపోయి, సకల సన్నాహంతో రేపు యుద్ధానికి తిరిగి రమ్మన్నాడు. రావణుడు లంకకు మరలిపోయి, అంతఃపురంలో పడక పైన కాళ్లు చేతులు బారలుగా చాచుకొని, తన దుర్భర దౌర్భాగ్య స్థితికి చింతల వంతల గూరుచుండినాడు. గర్వ్హణంతో తన విరోధులు నవ్వి గేలి చేస్తారన్నది అతడు లెక్కబెట్టలేదు; కాని, ఆ పాటలాధర – సీత తన పరాభవానికి నవ్వి పోవునేమో నన్న అవమాన భావంతో కుమిలిపోయినాడు.

ఆ తర్వాత, రావణుడు కుంభకర్ణుని పిలిపించి, తన యుద్ధ పరాజయాన్ని చెప్పి, వెంటనే యుద్ధానికి దిగి శత్రువుల రూపుమాప మని పురుకొల్పుతాడు. కుంభకర్ణుడు మొదట-సీతను మరల రాముని దగ్గరకు చేర్చి, అన్ననే రామునికి లోబడిపొమ్మని సూచిస్తాడు. ఈ మాటలకు రావణుడు కోపోద్రిక్తుడై లేచి, తానే స్వయంగా ఆహవానికి తొడంగి, శత్రువును తుద ముట్టించేవరకు పోరాడుమనని, రథసైన్యాన్ని ముందుకు రమ్మని ఆజ్ఞాపిస్తాడు. ఇది చూచి కుంభకర్ణుడు తన భయద త్రిశూలాన్ని కుడిచేతబట్టి, "ఇక ఒక్కమాటతో నా పని తీరిపోతుంది. విధి నా మెడబట్టి ముందుకు నెట్టుతున్నది. నాకు చావు మూడి ఉన్నది. నేను చచ్చిన తర్వాతనైనా సీతను రామునికి అప్పగించు. నీవు నా ప్రభువుడవు అయినా ఇదే విజయాని కంటె శ్రేష్ఠమైనది" అని అంటూ యుద్ధానికి బయలుదేరినాడు. ఆ వీడ్కోలు అత్యంత కరుణారసభరితము! పోతూ నిలిచి వెనుదిరిగి, "ప్రభో! నా తప్పులన్నిటిని క్షమించు. ఇక మరల నీ ముఖము చూడను నేను నోచుకోలేదు. సెలవు" అంటూ వెడలిపోయినాడు.

## ప్రభుభక్తి భావ వైరుధ్యం

కథను చెప్పుటలో అనుపమాన చాకచక్యం గలిగిన కంబకవి, మనలను రాముని స్కంధావారానికి తీసుకొని పోతున్నాడు. అక్కడ రాముని కండ్లతో, విభీషణుని ప్రథమ దర్శనాన్ని మనకు కలిగిస్తున్నాడు. కుంభకర్ణుని యుద్ధరథము కదనభూమి ప్రవేశించగానే రాముడు విభీషణునితో అంటున్నాడు – నీ పెద్దన్న రూపానికంటె ఇతనిదే ఎక్కువ అందంగా ఉన్నది! ఇత డెవడు?" అని అడిగినాడు. ఇక్కడ రాముడు, అసూయాలేశమైనా లేకుండా తన ప్రతిపక్షి వర్చస్సును, ఒంటిబలాన్ని మెచ్చుకొని

యూడుతున్నాడు. ఆయన అంటున్నాడు: "అతని ఒక భుజంనుండి ఇంకొక భుజంవరకు ఒకసారి చూపు సారించను, వాటి మధ్యనున్న దేహాన్ని పూర్తిగా చూడను ఎన్నో దినాలు పట్టును! ఏమి అది నడకొండా? రణకండూతితో ఉన్న మనిషివలె అతడు కాన్పించడం లేదు. అత డెవడు?" దీనిమీద, విభీషణుడు కుంభకర్ణుని మహిత గుణాలను అభివర్ణించి, సీతాపహరణ విషయంలో రావణుని ఆయన ఎట్లా మందలించినది; ఇంకా ఆయనికి, తనపట్ల రావణుని పట్ల గల గాఢ ప్రేమాతిశయాన్ని గూర్చి గూడ రామునితో చెపుతాడు. ఇది విని సంప్రీతుడైన రాముడు, కుంభకర్ణుని దగ్గరకు, విభీషణుని పోయి నచ్చజెప్పమని, అతడు తన దండు వీడు చేరేటట్లు చూడమని కోరుతాడు ఈ మాట ప్రకారం, విభీషణుడు కుంభకర్ణుని దగ్గరకు పోయి ఎదుట నిలిచి ప్రణామం చేస్తాడు. కుంభకర్ణుడు విభీషణుని పరిష్వంగ మాచరించి, తమ్మునితో – "రాముని పక్షం చేరడంవల్ల ఈ రణమారణ హోమంలో, మన సోదరులలో మిగులబొయ్యేది నీవు ఒక్కడవే అన్నదే నాకు సంతోషము. కాని, అట్టి నా ఆశకు విఘాతం కలిగించి, ఈ పక్ష శిబిరానికి ఒక మూఢునివలె ఎందుకు వచ్చినావు? నీవు చేసిన కఠోర తపస్సు వలన, న్యాయ విచక్షణతను ధర్మస్వరూప జ్ఞానాన్ని మృత్యుముఖ మెరుగని జీవితాన్ని పొంది ఉన్నావు; అయినప్పటికినీ ఉదాత్తమతీ, నీ రాక్షసకుల నైచ్యాన్ని పోగొట్టుకోలేకపోవడం సంతాపకరం" అని పలికినాడు. విభీషుడు రాముని పక్షం విడనాడి, మరల రావణ బలగంలో చేరినాడన్న అపోహలో కుంభకర్ణుడు ఈ మాట లంటున్నాడు. ఆ పొరపాటుతోనే ఇంకా అంటున్నాడు – "సర్వజగత్తుకు ప్రభువైన వాడు, అదిగో అక్కడ! ప్రయోగ సన్నద్ధమైన శరాసనంతో నిలబడియున్నాడు! ఆయన వెనుక మిగత వీరు లంతా నిలుచుండి యున్నారు. విధి–మృత్యువు మనలను తుదముట్టించనే కృతనిశ్చయములై ఉన్నవి. ఇప్పటికీ పరాభూతులైయున్న వీరి కడకు, ఆ రాముని త్యజించి ఇప్పు డిట్లా ఎందుకు వచ్చినావు?" అని.

విభీషణుడు ప్రతివచనం పలుకుతున్నాడు – ఆ వేదాధి దేవుడే ప్రేమాంతరంగుడై, ఒక కోర్కెతో నన్ను ఇక్కడకు పంపినాడు. అన్నా, నీ వెన్నడూ నీతిని విడనాడి ఎరుగవు. కాబట్టి నీవు వెంటనే నా వెంట వచ్చి రాముని చేరాల". ఈ మాట లంటూనే విభీషణుడు కుంభకర్ణుని పాదాక్రాంతుడై, రావణుని వీడి రాముని చేరమని బ్రతిమాలుకొన్నాడు.

కాని, విభీషణుని వలె గాక తాను నీతి ధర్మాల విలువల హీనస్థాయిలో నివ సిస్తున్నట్లు కుంభకర్ణునికి బాగా తెలుసు. అందువల్లనే ఉన్నట్లుండి ఇప్పుడు ఉదాత్త ఆశయాలకు పోరాడడం, రావణుని విడనాడడం, తన మనికినే అన్నృత పరచి భీరుత్వాన్ని ప్రకటించడమే అవుతుందని కుంభకర్ణుని అభి ప్రాయం. అయినప్పటికీ కుంభకర్ణుడు విభీషణుని ఉన్నత ఆదర్శానురక్తి – లక్ష్యశుద్ధిని గ్రహించగలిగే ఉన్నాడు. విభీషణుడు అట్టి గుణగరిష్ఠుడు కావడంవల్లనే, ధర్మస్థాపనకు రావణుని ఎదిరించి పోరడమే ఆయన విజ్ఞ తకు ఉచిత కర్తవ్యమని గూడ కుంభకర్ణుని మతం.

కుంభకర్ణుడు రావణుని మహిత గుణములను గూర్చి యోచించగా ఇట్లా స్తోత్ర ధోరణిలో పడిపోయినాడు. ఆ గుణాలను తలచుకొని ఆనంద తన్మయతతో పలుకుతున్నాడు——

ఆయన అప్రతిమాన వీరుడు
 శత్రు రహితుడు!
ఆయన ఉత్తుంగ భుజాలు శివుని
 భూరి కైలాసమును పైకెత్తి ఉన్నవి.
యముని పరాభవించిన ఆ రావణుని
 బలోపేత బాహువులు ఇప్పుడు
ఆ యముని పాశములచేతనే కట్టుబడి
 ఆ మహావీరుడు
ఏకాకియై పరివార సేవా విరహితుడై
మృత్యు సద్మము ప్రవేశించడము
 ధర్మ సమ్మతమా? ఉచితమా?

భిన్న స్వామిభక్తి భావముల మధ్య చిక్కొని కుంభకర్ణుడు నలిగి పోతున్నాడు. రావణుని ప్రేమించినంత గాఢముగానే, అతడు విభీషణుని గూడ ప్రేమించేవాడు అయినందున, ఇప్పుడు ఆయన తలపులు తమ్ముని మీద వ్రాలినవి. ఇక ఒక్కక్షణమైనా ఇక్కడ నిలువవద్దు; ఆ రాముని మ్రోలకు తిరిగిపోయి, ఆయన స్నేహాన్ని సంపాదించుకో. కాగల కర్మ ఫలము కావలసిన సమయంలో కాకతప్పదు. నాశనానికై నిర్దిష్టమైనది కను

విచ్చి కాచి కాపాడినా ధ్వంసమైపోక తప్పదు. నీకంటె విజ్ఞాన ఘనులు చతుర మనస్కులు ఇక్కడ ఇంకెవరున్నారు? నిశ్చింతగా, అనుతాపరహితంగా క్రమ్మరిపోమ్ము. నీవు అమరుడవు; మాకై అనుక్రోశించవలసిన పనిలేదు–" అని చెప్పుతూ కుంభకర్ణుడు, తమ్ముని మరల కౌగిట జేర్చి, ఎదను గట్టిగా ఒత్తిపట్టి, చేష్టలుడిగి నిలబడి నిలబడి, నిట్టూర్పు లూర్చి ఊర్చి, అక్లే తన నిండు చూపులు చాలసేపు విభీషణునిపై లగ్నంచేసి, "నేటితో మన భ్రాతృబంధం ఛిన్నమైపోతున్నది" అన్నాడు. ఈ మాటలన్నీ విన్న విభీషణుడు కుంభకర్ణుని కాళ్ళపై బడినాడు. అప్పుడు ఆ శరీరంతో గూడ ఆయన ఆత్మగూడ కుదించుకొని పోయినది. ఆపైన దీనిని గూర్చిన చర్చ నిష్ఫలమని నిశ్చయించుకొని లేచి వెడలిపోతున్నాడు. అప్పుడు చుట్టూ ఉన్న రాక్షస సైనిక సమూహం గౌరవపురస్కరంగా చేతనున్న ఆయుధాలను పైకెత్తి విభీషణునికి ప్రణామాలు గావించినది.

మాటామాటలో, ఈ అంశం ప్రస్తావించుకోవలసి ఉన్నది. వాల్మీకి రామాయణంలో ఈ ఇద్దరు సోదరుల సమావేశ ప్రసక్తే లేదు. కంబమహాకవి సాహసిక బుద్ధి వైభవము, హృదయంగమ నాటకీయ కల్పనా చాతురి – ఈ రెంటి నుండి కలగలుపుగా పుట్టిన సన్నివేశ మిది!

విభీషణుడు తిరిగి వచ్చి రాముని దండు వీడు చేరి, తనమధ్య కుంభకర్ణుని మధ్య జరిగిన సంభాషణ క్రమము నంతా విపులంగా చెప్పినాడు. దాటరాని విధికి తలయొగ్గి, కుంభకర్ణునితో పోరాడ మని లక్ష్మణునికి రాముడు అనుజ్ఞ ఇచ్చినాడు.

## కుంభకర్ణుని చరమ వాంఛ

ఆ ఇద్దరు ప్రఖ్యాత మహావీరులు – లక్ష్మణ కుంభకర్ణుల ద్వంద్వ యుద్ధం వీక్షించను వేలకు తరబడి జనం గుమిగూడిపోయినారు. పోరవలసిన ఆదర్శ మేదీ కుంభకర్ణునికి లేదు. కాని, పోరి ప్రాణాలు వదలుటే అతని విధ్యుక్తము. ఇక లక్ష్మణుడన్ననో – ఒక పరమోత్కృష్ట లక్ష్యసిద్ధిచే ఉత్తేజితుడై ఉన్నాడు; అందువల్ల అత్యంత సమరోత్సాహంతో నిండి యున్నాడు. వారి సంగర ప్రథమ దశ ఛలోక్తులతోను, వ్యంగ్యభాషణాలతోను రసవత్తర ప్రత్యుక్తులతోను నిండి ఉన్నది. వీటిమధ్య దారుణ దీర్ఘ

యుద్ధం జరిగినది. ఇందు, ఒకనొకరు మించుతూ, క్రిందు అవుతూ చివరకు ఇద్దరూ డస్సిపోయినారు. ఈ స్థితిలో రాముడు యుద్ధంలో చేయిచేసుకొని, కుంభకర్ణుని సైన్యాన్ని చెదరగొట్టి, ఓడించి తరుమగొట్టి ఆ ప్రతిపక్షి భూరి కాయాన్ని అమ్ములతో తూట్లు పడగొట్టినాడు. సిందూర వర్ణంలో ఒక నెత్తు రేరు పొలికలనంతా వెల్లువబెట్టినది; దానిలో కుంభకర్ణుని రథనివహము గజఘటలు అశ్వదళము పదాతిసైన్యము కొట్టుకొని పోయినవి. ఇప్పుడు మోహనాకారుడైన రాముడు – చాపము ధరించిన చారు గంభీర భుజాలతో ఛిన్న అవయుడై, వికలుడై పడియున్న కుంభకర్ణుని ఎదుట ప్రత్యక్షమైనాడు. అప్పుడు కుంభకర్ణుడు విభీషణుని శ్రేయార్థమై కరుణాత్మకంగా ఇట్లా ప్రార్థిస్తున్నాడు:

"చిరంతన ధర్మోద్భవమై సర్వవ్యాపకమైన సత్యమునందు స్థిరముగ కాలూనినవాడు – ఈనా తమ్ముడు. మా దైత్యజాతి అపమార్గము ఎరుగని వాడు. ఒక భూపాలుని వేషమున భువి నవతరించిన ఓ ప్రభూ, మా విభీష ణుడు మీ పాదము లాశ్రయించి ఉన్నాడు; వానిని అనుగ్రహింపుమని నిన్ను వేడుకొంటున్నాను. తన తమ్ముడైనప్పటికిని ఆ కటిక రావణుడు ఇత నిని దరిజేరనీయడు; చూడగానే తుదముట్టించును. ప్రభో, ఈ ఒక్క వర మర్థిస్తున్నాను – ఈ సమరాంతం వరకు ఇతనిని మీ రెక్కల నీడనో, మీ తమ్ముని అండనో, లేక ఆ హనుమంతుని ప్రాపుననో పెట్టుకొని కాపాడు చుండవలె" అని ప్రార్థించగా రాముడు అనుగ్రహించినాడు; ఇది విని కుంభ కర్ణుడు ప్రాణాలు వదలినాడు.

ఉదాత్త శౌర్య వైలక్ష్యము–సూక్ష్మ న్యాయ గ్రహణ బుద్ధి – హృదయ లాలిత్యము గలిగిన ఈ కుంభకర్ణుడు కంబమహాకవి అమరసృష్టి! ఇక వాల్మీకి కుంభకర్ణుడో – వికృతరూపుడు, కంబకవి పాత్రకు కేవలమూ భిన్నుడు. అందుచేత, విభీషణుని స్తుతించి కుంభకర్ణునికి అశ్రుతర్పణం చేస్తాం.

## రావణుని ఆర్తి

కుంభకర్ణుని మరణవార్త రావణుని దరిలేని ఆర్తి కడలిలో ముంచి వేసినది. రావణునికి ధాన్యమాలయందు బుట్టిన కోపనుడు – అతికాయుడు, కుంభకర్ణుని మరణానికి కసిదీర్చుకోను యుద్ధానికి దిగినాడు. పెద్ద సైన్యం

అతనివెంట నడచినది. లక్ష్మణునితో మార్కొనిన ఈ దైత్యకుమారుడు తల నరుకబడి కాలధర్మము నొందినాడు.

రాచపరువు దీసిన యీచావును దూతలు రావణుని చెవిన వేసినారు. అతికాయుని మరణవార్త రావణుని మనసును పరస్పర భిన్నావేశాలకు తీవ్ర ఘర్షణకు పాల్జేసినది:—

ఈర్ష్యలు ఏడ్పులు అతని తలను పైకెత్తును,
అవమానం వెంటనే దానిని వంచివేయును.
చచ్చినవారిపై దయ అతని పరాక్రమాన్ని
రేగగొట్టి పురికొల్పును;
ఘూర్ణిత క్రోధము దుఃఖము
రావణుని మానసాన్ని బాధించగా -
మహార్ణవ కల్లోలాలు
ఒకదాని నొకటి ముందుకు నెట్టి
మరిమరీ తీరానికి తరిమి,
వెంటనే వెనుదిరిగి దూరంగా మరలిపోయినట్లు,
ఆయన అశ్రుపూరం
కండ్లనుండి పిక్కటిల్లు చుండగా -
లేచి నిలబడును,
భూమండలాన్నే ఎత్తి విసరిపార వేయాలనుకొనును,
ఊర్ధ్వలోకాలవే పట్టిలాగి
నేలకు విసరి కొట్టాలనుకొనును,
సకల ప్రాణి కోటినే
ఒక్క తన్ను తన్నాలనుకొనును,
ఆడుది అనే పేరుగల్ల అన్నిటినీ
రెండుగా నిలువున చీల్చి
వేయాలను కొనును.

## ఉత్కట దుఃఖం

ఈ ఆవేశాన్ని చూచి, రావణుని చుట్టుప్రక్కల ఉన్నవారంతా విఘాకు పడినారు. తన్ను ఎన్నడూ విడనాడని నాటకీయ రసభావము - పార

మంటిన మానసిక శాస్త్రజ్ఞానము గలిగిన కంబుడు ఈ తరుణంలో పుత్రుని పోగొట్టుకొనిన అభాగ్య – ధాన్యమాలను రంగమున ప్రవేశపెట్టుతున్నాడు. ఆమె రావణుని భార్యలలో ఒకతె; రణ మరణము బొందిన అతికాయుని తల్లి. కోపోద్దీపితుడయ్యు, తానే ఆ పుత్ర మరణ కారణమని ఎరిగిన రావణుడు, ధాన్యమాల పుత్రశోక తీవ్రత ముందు, ఆ దారుణ యుద్ధ ప్రయత్నాన్ని సమర్థించుకోవలసి వచ్చినది, రాణి – ధాన్యమాల, ఉన్నత వంశ గౌరవం గలిగి, సార్వభౌమ సంప్రదాయమున పెరిగిన మానవతి! రావణుడు గూడ ఆమెను ప్రత్యేకగౌరవంతో చూచేవాడు. ఆమె పెద్దగా గుండెలు బాదుకొంటూ రావణుని మ్రోలకు వచ్చి, ఆయన పాదాలముందు కూలిపడి పోయినది. అంటున్నది :—

"నీవు విన్నదానిని ఇప్పుడైనా
చెవిని పెడుతావా ?
నేనుచెప్పేది వినిపించుకోవా ?
నా కంటి పాపను, నా అనుగు బిడ్డను
చూపించవా ?"

మిక్కుటమైన ధాన్యమాల శోకం ఎదుట, రావణుని క్రోధోద్ఘోషణములు అట్లే స్తంభించి మూగై పోయినవి. సీతపై జూపిన కామోన్మాదానికి భర్తను ధాన్యమాల ఎంతగానో దూషించి—

"ఇంతేగాదు, ఇంకెన్నో కడగండ్లు సీతవలన మనకు దాపురించబోతున్నవి" అని ఎచ్చరించినది.

ఇట్లా పలవించే రాణిని రావణునికి పరిచర్యలు చేస్తూ ప్రక్కన ఉండిన అప్సరసలు – దేవనర్తకులు – ఊర్వశీ మేనక ఇద్దరూ ఎత్తి, ఆమె అభ్యంతర మందిరంలోకి మోసుకొని పోయినారు.

దీని తర్వాత, రావణుడు తన కొడుకులలో వీరాధివీరుడైన ఇంద్రజిత్తును యుద్ధానికి పంపినాడు. అతడు తన రహస్యాయుధము–బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగింప సంకల్పించుకొన్నాడు. ఈ మాయామయాస్త్రము పోయి శత్రువులపై విషంజల్లి తిరిగి వచ్చి యజమానిని చేరగలిగిన సామర్థ్యం గలది. రామ లక్ష్మణులు–వారి స్కంధావారమంతా మంచి నిద్రలో నుండగా, నడిరేయిలో ఇంద్రజిత్తు దీనిని ప్రయోగించినాడు. అది విషవాయువులను పరు

పగా, రామ లక్ష్మణులు-మిగత సైన్యమంతా మతిదప్పి చచ్చినవారి వలె పడిపోయినారు. జయోత్సాహంతో ఇంద్రజిత్తు రణభూమి వదలి, నిజాంతః పురం చేరి హాయిగా నిదురబోయినాడు.

జాంబవంతుని మాటమీద, హనుమంతుడు సంజీవి పర్వతం పోయి, దానిని పెళ్ళగించుకొని, లంకలలో పొలికలనుడు తీసుకొని వచ్చినాడు. ఆ కొండయందలి ఓషధులను మూర్కొని, రామాదులందరూ తిరిగి స్మృతికి వచ్చినారు. రాముడు తేరుకొని, ఆకులత నొందియుండిన విభీషణుని మోము జూచి, అవితాకుకు కారణ మడిగినాడు. విభీషణుడు, హనుమంతుని ప్రయత్నంతో అందరూ ఎట్లా మరల చైతన్యం పొందినారో వివరించినాడు. ఇది విన్న తక్షణమే రాముడు హనుమంతుని కృతజ్ఞతాపూర్ణ ఉపగూహనం గావించుకొన్నాడు.

## ధర్మ విజయం

మరుసటి దినం, ఇంద్రజిత్తు తన మాయోపాయం విఫలమైనదని తెలుసుకొన్నాడు. రావణ ప్రేరితుడై ఇంద్రజిత్తు మరల భీషణ సంగ్రామం చేసినాడు. అందు, లక్ష్మణుడు ఒక అర్ధచంద్ర బాణంతో ఇంద్రజిత్తు తల దునిమినాడు. పుత్రుని మరణవార్త రావణుని పూర్తిగా వికలుని జేసినది.

ఈ విపత్తుకంతా సీతే మూలమని రావణుడు భావించినాడు; కోపావేగంతో సీతను తుదముట్టించాలనుకొని, అశోకవనానికి గబగబ బయలు దేరినాడు. మహోదరుడు అడ్డుదగిలి నిలిచి, "సీతనేగాన చంపతే శాశ్వత అపకీర్తి పొలగుదువు" అని చెప్పినాడు. సముచిత క్షాత్ర రణధర్మము-కీర్తి పట్ల రావణునికి గల నైసర్గిక ప్రీతిని, అతడు రావణుని మనసుకు దెచ్చి, వాటి పేర ఆయనను ఆ వెర్రి పోకలనుండి మరలించినాడు.

రావణుని దుఃఖోన్మాదం ఇప్పుడు యుద్ధోన్మాదంగా తిరిగినది. రామునితో మహాద్భుత శౌర్యంతో పోరినాడు. కాని, రాముని బాణమొకటి, రావణుని మెడను* తరిగి, తలను నేలగూల్చినది. తుదకు రాముని శౌర్యము నీతి విజయము సాధించినవి! సీతకు నిర్బంధమునుండి విముక్తి గలిగినది. మృతులైన రాక్షస వీరులందరికి విభీషణుడు అపరక్రియలు జేసినాడు.

* ఇది వాల్మీకి పాఠము. కంబరామాయణంలో, ఎదగాటవేసి చంపినట్లున్నది.

విజయ వీరులు, సీత విభీషణ సుగ్రీవ హనుమదాదు లందరూ అయోధ్యకు బయలుదేరినారు

## ఒకే పలుకు పలికిన శత్రుఘ్నుడు

ఈలోపల, పోయిన పద్నాలుగేండ్లుగా రామ ప్రతినిధిగా రాజ్యపాలనం చేస్తుండిన భరతుడు, అనుదినము ఉత్సుకతతో రాముని రాకకై దక్షిణ దిక్కు చూస్తూనే ఉండినాడు. ఈనాటితో ఆ పద్నాల్గవ ఏటి గడువు తీరి పోతున్నది. భరతుడు ప్రాసాద గోపురం ఒకదానిపై నెక్కి రామునికై దక్షిణదిక్కు చూచినాడు; రాముని పొలుకువె కానరాలేదు. నిరాశోపహతుడై, పూర్వం అనిన మాట ప్రకారం, అగ్నిలో దూకి రూపుమాపుకోవలె నను కొన్నాడు. ఆయన ఆజ్ఞప్రకారం పరిచారకులు ఒక పెద్ద మంట చేసినారు. పౌరులను మునులను అందరినీ పిలిపించి, నిర్ణీతకాలం దాటి ఒక్క క్షణమైనా బ్రతుకనన్న తన గట్టి తీర్మానాన్ని వా రందరికీ వినిపించినాడు. ఆ పెద్దలు చేసిన నివారణోద్యోగాలన్నీ విఫలమైనవి. ఈ ఉద్రిక్త సమయంలో, భర తుని కడగొట్టు తమ్ముడు–శత్రుఘ్నుడు అక్కడకు చేరుకొన్నాడు. ఆయనతో భరతుడు "నేడే రాముడు తిరిగివస్తానని చెప్పిన కట్టడి దినము; కాని, ఆ రాముడు రాక తప్పినాడు. నేను అగ్నికి ఆహుతి అయ్యే ముందు నిన్ను ఒక్కటి కోరుతున్నా, రాముడు వచ్చేదాక నీవు ఈ రాజ్యాన్ని పాలించి, ఆయన రాగానే ఆయనకు అప్పగించాల" అన్నాడు.

మర్మ భేదకమైన ఈ మాటలు విని, శత్రుఘ్నుడు తన్నుదాను నిందించుకొన్నాడు. ఈయన ఈ ఇతిహాసంలో ఒక నీరవపాత్ర; కంబ రామాయణ మంతటిలోను ఒకేసారి దప్ప మాట్లాడనివాడు. లేకలేక ఆయన ఇప్పుడు మాట్లాడగా, కంబరు తన చేతనైనంతమట్టుకు, ఆ మాటలలో లయా న్విత మాధుర్యం నింపుతున్నాడు. ఆ లయనంతా కాకపోయినా, ఆ మాటల లోని బుద్ధి విలసన విషయమును మాత్రం ఇట్లా అనువదించవచ్చు :—

భూకాంతను విడనాడి
కానలనేల నేగిన మహా భాగుని
పిరుందున చనిననాడే
సోదరుడు !

పోయినవారు సమయానికి
తిరిగి రానందున
తన ప్రియజీవితాన్ని అగ్ని కర్పించను
కృతనిశ్చయుడైనవాడు గూడ
సోదరుడే!
ఏమీ పట్టించుకొనక
ఒక ప్రేక్షక మాత్రుడుగా
ఎడగలిగి నిలుచుండిన
నేను,
సిగ్గులేక ఈ రాజ్యాన్ని ఏలవలెనా:
అహో! ఈ రాజ్యాధికార సౌభాగ్యం
నిజంగా మధురమైనది!

మూల కావ్యమునందలి ఈ లయబద్ధ విన్యాసంలో, ఎక్కడ భావావేశము కేంద్రీకరింపబడి యున్నదో అక్కడనే శబ్దాలంకార మాధుర్యము పడునట్లు కల్పింపబడి యున్నది. శత్రుఘ్నుని భాషణమునందలి భావోద్రేక సాంద్రతలను అర్థ సాంద్రతలను వేరువేరుగా రెండు రేఖాపటాలలో పొందుపరచినట్లయితే, ఆరోహణ అవరోహణముల రెండు దశలయందునూ, ఈ సాంద్రతల సంపూర్ణ సమైక్యత గోచరించును. కాబట్టి తమిళమునందలి ఈ పాట, కవితాశిల్పమున ఒక అపూర్వ అద్భుత సృష్టిగా పరిగణింపబడుతున్నది.

## పట్టాభిషేకము

శత్రుఘ్నుని అనుకంపా పూర్ణ అవస్థను, భరతుని అచంచల దృఢ నిశ్చయమును చూచిన సాకేత నగర పౌరులు దిగ్భ్రమజెంది ఏమీ పాలుబోక నిలబడియున్నారు. అప్పుడు – 'వచ్చేసినాడు రాముడు!' అని పెడబొబ్బలు పెడుతూ హనుమంతు మహావేగంగా అక్కడికి ప్రవేశించినాడు. వచ్చి, భరతుని ప్రాణాహుతికిగా పేర్చిన చితిమంట కణకులను హనుమంతుడు తన చేతులతోనే ఆర్పి బొగ్గులుచేసి, ఆనందాతిరేకంతో చప్పట్లు చరస్తూ, ఎగిరెగిరి గంతులు వేస్తున్నాడు. రాముడు వస్తున్నాడన్న శుభవార్త భరతుని ఆనంద తన్మయతలోనికి ద్రోచినది. ఏదో ఒక పిచ్చివానివలె

భరతుడు ప్రవర్తిస్తున్నాడు - చుట్టూ ఉన్న వారందరికి దండాలు పెడుతున్నాడు-ఉన్న తన దాసీజనానికి మొక్కులిడుతాడు-చివరకు తనకుతానే ప్రణామా లర్పించుకొంటాడు. భరతుని మత్తునిగా జేసిన ఆ ఆనందాన్ని కవి వర్ణిస్తున్నాడు :

ప్రేమ అనే వస్తువు
నిజంగా
బట్టీబెట్టి దించిన ద్రాక్షాసవసారమే !

ఇంక కొంత సేపటికి, సీతారామ లక్ష్మణులు, విభీషణ సుగ్రీవులు తక్కంగల వానర బలగంతో విచ్చేసినారు. అయోధ్యా నగరమంతా ఆనంద సాగరంలో ముంచివేయబడినది. మంగళ వాద్యఘోషతో తూర్యనాదాలతో రామ పట్టాభిషేకం జరిగినది !

# 8

## ముగింపు

పదివేల పాటలకు పైబడిన కంబ మహాకవి ఈ ఇతిహాసానికి, ఈ లఘు వ్యాసంలో తగినంత న్యాయం జరపడం కష్టసాధ్యం. జీవిత చక్ర కేంద్రసత్యాన్ని కనుగొన్న విజ్ఞానివలె, ఈ కవి ఈ గ్రంథమంతటా, ఆత్మ విశ్వాసము ప్రపత్తులతో మాట్లాడుతున్నాడు. ఉదాహరణకుగా హిరణ్యకసిపు వాదపటలాన్ని తీసుకొందాం :- స్వయంకల్పిత అత్యంత రసవత్తర సన్నివేశాన్ని ఇందు కవి ప్రవేశపెట్టుతున్నాడు : భగవంతుని సృష్టి కర్తృత్వాంశమైన బ్రహ్మ, పరమార్థమైన విష్ణువుకు తటస్థపడి, సృష్టిక్రమాన్ని గూర్చి సంభాషణ ప్రారంభిస్తాడు : హిరణ్యుని పుత్రుడు - ప్రహ్లాదుని ప్రార్థనపై భగవంతుడు బ్రహ్మాండాన్ని ఛేదించి, విశ్వపరిధిని ఛిన్నంచేసి, నరసింహ రూపంలో అవిశ్వాసి అయిన హిరణ్యుని ఎదుట ప్రత్యక్షమై, రక్తసిక్తదంష్ట్రలు

నఖములతో అతనిని సంహరిస్తాడు. ఆ నరసింహుడు ప్రచండోగ్రతతో గర్జిస్తుండగా, కంబుడు కళాపరిపూర్ణమైన నిండు పనితనంలో లలిత వ్యంగ్య హాస్యరసంతో బ్రహ్మను ఈ రంగమున ప్రవేశపెట్టి, ఆ వైకుంఠ సింహ మూర్తి ఉగ్రతను ఉపశమింపజేయ ప్రయత్నిస్తున్నాడు. పరమోదాత్త భక్తి భావంతో, ప్రేమసూచకమైన వాక్యాలను కలిపి బ్రహ్మ పలుకుతున్నాడు :-

"దేవాది దేవా,
నీవు ఈ రూపమును ధరించి
నిన్ను నీవే సృష్టించుకొని యుండవలెనన్న
సత్యాన్ని స్పష్టం చేస్తున్నావు.
కాని, ఇట్లా స్వయంసృష్టికి దిగి,
నారసింహా,
నా అధికారంపై నివు దురాక్రమణ చేయలేదా ?
ఈ అక్రమ జోక్యంతో——
ఈ అనంతకోటి రూపాలకు
స్రష్టగా నన్ను సృష్టించిన
నీ ఉద్దేశాన్నే నీవు వమ్ము చేయడంలేదా?"

బ్రహ్మ చేసిన ఈ గేలి మాటలలో తర్కానికంటె భక్తే ఎక్కువగా నున్నది. తన పాలనాధికారాన్ని ఇతరునికి ఒసంగేదానికి అధికారం గలిగిన సార్వభౌమునికి, దానిని ఉపసంహరించుకొని తిరిగి దానిని తన స్వాధీనం చేసుకొనే అధికారం లేదని బ్రహ్మదేవుని ఎత్తిపొడుపు. కాని, బ్రహ్మ యజమానిపై మోపిన క్రింది నిందాస్తుతిలో సత్యమున్నది :-

"ఈ అనంతకోటి తారాగణము గ్రహకోటి,
ఉత్తర సాగరమండలి
క్షణభంగుర బుద్బుదములవలె
నీ మూల ప్రకృతియందు మెదలుచుండును.
ఈ సమస్త రూపములూ నీవే,
కాని, నీవు ఇట్టి రూపములలో
ఒకదానిని ధరించి

ఆది మధ్యాంతర రహితమైన
నీ బహు రూపత్వానికి
అనవసరంగా సంకుచితత్వాన్ని
విధించుకొనుట లేదా ?''

ఇట్లా, భగవంతుని అపరిచ్ఛిన్నత–ఆయన వ్యక్తరూపం యొక్క దోష భూయిష్ఠమైన పరిచ్ఛిన్నతల మధ్యగల అసంగతత్వాన్ని ప్రదర్శించి, భగవంతుని సర్వాంతర్గతత్వము - సర్వాతిశయత్వముల వైరుధ్యమును, బ్రహ్మ ఈ క్రింది పద్యంలో ఎత్తి చూపుతున్నాడు :

''నిన్ను విడిచి నాకు వేరు ఉనికిలేదు;
నీ కృప లేనిదే
జీవినిగాని జడమునుగాని సృజించలేను;
నీకు ముందుగాని నీకు వెనుకగాని
నేను ఉండలేను,
నీ సువర్ణ తత్త్వమునుండి ఉద్భవించిన
స్వర్ణకారునివంటి వాడను నేను;
నీ కృపాతిశయంతోనే
నేను దానిని వివిధరూపాలుగా చేస్తున్నాను.''

కంబుడు, సృష్టికర్తతో ఆధ్యాత్మిక విషయాలనుగూర్చి చాలా పాటలలో వాదిస్తున్నాడు. ఇది దృష్టి వైశాల్యము స్పష్టతలలోను, భక్తిపూర్ణమైన హాస్య శోక రసముల వ్యాప్తియందును, కవితా శిల్పమందలి అత్యుత్తమ ఓజస్సునందును, నాటకీయశక్తి యందును – ప్రపంచ సాహిత్యము లందలి ఉత్తమోత్తమ రచనలతో తులతూగగలిగి యున్నవి. సాపేక్షిక రూపమైన ఈ ప్రపంచంలో నివసించేవారి బుద్ధిని, ఈ అద్వైత భావ సంబంధము సంభ్రమింప జేస్తున్నది. కాని, కంబుని కవితాస్ఫూర్తి ఈ సంభ్రమమునకు నాటకీయతను స్థిరత్వమును సమకూర్చి, ఈ సంభ్రమమునే ఆమోదించి అద్వైత సత్యమును గట్టిగా నిరూపించుటకు ఉపయోగపడుతున్నది.

కంబమహాకవి సాధించిన ఈ విజయానికి ఆయన చెప్పిన విషయంగాక, దానిని చెప్పిన తీరే కారణభూతమై ఉన్నది. ఆయన ప్రయోగించిన

ప్రతిమాట అనూనయించి నమ్మించగలిగిన శక్తికి కేంద్రమై ఉన్నది. ఈ మాటలో, కవి చేతనపూర్ణమైన విశ్వాసము మానవ కంఠధ్వని స్పందనాలుగా మారిపోతున్నది. ఈ స్వచ్ఛస్పందనాలు అనుభవించదలచుకొన్నవారు కంబుని తమిళ పాఠాన్నే వినవలెగాని, అనువాదకుని దుర్బల కృతక శబ్దాలను విన్నంత మాత్రాన ప్రయోజనం లేదు.

కంబునికి జీవితమంటే – ఒక అవివేకి చెప్పిన శబ్దాడంబర క్రోధపూర్ణ నిర్దేశరహిత కథగాదు; జీవితమంటే ఈ కవికి అర్థము క్రమము గౌరవములతో నిండిన వర్తనము. కంబుని కవితా శిల్పానికి మూలము సర్వ చేతనాచేతనము లందుగల సానుభూతియే. ఆయనకు దృగ్గోచరమైన జీవిత దృశ్యము – విశ్వపథయాత్రయందు ఆవశ్యకమైన ఒక మజిలీని దాటిపోవుటే కాబట్టి ఈ భూతల జీవిత సంఘటనలు జననానికిముందే – ఎప్పుడో వీర్పడిన కారణాలకు కార్యరూపమొంది, మరణానంతరం జీవితంపైగూడ ప్రభావం కలిగి ఉంటున్నవని వ్యాఖ్యానిస్తున్నాడు. అందువల్ల కాలాతీత అవిరామత్వంలో మానవుడు ఒక భాగమేనన్న జ్ఞానంతో ఆయన జీవితాన్ని మరింత లోతుగా త్రవ్వి త్రవ్వి చూచి చూచి, భూతభవిష్యత్తుల నిత్యత్వంలోనికి ఇంకా దిగి దిగి చూడ గలుగుతున్నాడు. జీవితంయొక్క మాయామయ నిశ్చల దృష్టితో పరికించేదానికి, జీవిత భిన్న భిన్న ఖండాలను ఒక సమైక్య రూపానికి దెచ్చేదానికి, గాఢ ఆశామతి అంతర్దృష్టులనుబట్టి పూర్ణత్వాన్ని వివరించి చెప్పను ఈ ఎరుక కలిమి ఆయనకు సామర్థ్యాన్ని కలిగిస్తున్నది. ఈ దృష్టి కంబునికి మతి నిశ్చలత్వాన్ని ఒసంగుతున్నది, (ప్లేటో విషయంలో ఎమర్సన్ చెప్పిన విధంగానే) కంబుని విషయంలో ఇట్లా చెప్పవచ్చును :—

సూర్యప్రభా భాసమైన ఆయన దృక్కేంద్రంనుండి సంశయ మేఘావృతంగాని ఒక దృఢ విశ్వాసం ఉద్భవిస్తునది – అని.

అంటే – కంబుడు కేవలం ఆధ్యాత్మిక విషయిక కవి అనిగాని, వీధి వీధులు దిరిగి మత సామగ్రిని అమ్మే ప్రచారకుడు అనిగాని అర్థంగాదు. పాత్ర చిత్రీకరణమునందును, సన్నివేశ వర్ణనమునందును యథార్థ ప్రపంచమునందే ఆయన కాళ్ళూని వేళ్ళు పారించుకొని ఉన్నాడు. ఇక, ఆయన ఇతిహాసం, జీవిత అంశాలను ప్రకృతి గాథలనే ఆధారంగా చేసుకొని నడక

సాగిస్తున్నది. బీటలువారిన మరుభూమి నిర్జలత్వమును - జీవన్ముక్తావస్థను వాంఛించే ఒక యోగి, ఒక సామాన్య వారకాంత - వీరిద్దరి రసహీన భావంతో పోల్చి చెప్పగలిగిన మొండి ధైర్యంగూడ ఆయనకు ఉన్నది. మహాసముద్రంమీద సేతు నిర్మాణ ఘట్టంలో ఒక సినిమా దృశ్యంవలె - ఒక కోతి ఒకేసారి మూడు పెద్ద తిప్పలను: ఒక దానిని కాలితో దోచు కొంటూ, ఇంకొక దానిని తన పెద్ద బారలతో నిండుగా పట్టుకొని, మరియొక దానిని తన తోక కొనతో చుట్టి పట్టికొని పోవుటను ఆనందకరంగా వర్ణించి చెప్పగలడు. ప్రత్యక్ష దర్శనభాగ్య మబ్బినట్లు, సొంతంగా తానే వాటిలో ఇరుక్కొని పోయినట్లు ఒక నూరు యుద్ధాలను వర్ణించగలడు. ఈ సమరా లన్నీ, ఒకదాని కొకటి వేరువేరుగా పన్నబడి సాగింపబడి రోమహర్షణము అనిశ్చయావేగము తీవ్రజవములతో నిండి నిబిడీకృతమై యున్నట్లు వివరించి చెప్పగలడు. మానవ హృదయ మర్మగుణజ్ఞుడుగా, మానవచేష్టల నిగూఢ హేతువులను నేర్పుతో బయటపెట్టగలడు. ఇతిహాస కాఠిన్యమును నాటకీయ సారళ్యంతో సమపాళ్లుచేసి, ఆ రెండు గుణాలను నిజకళాపూర్ణ సాంద్ర భావుకతతో తేజోవంతం చేయగలడు.

ఆయన ఏది చేసినా చెప్పినా, ముఖ్యాంశాలపట్ల పాఠకునిలో గాఢాను రాగ పరిచయం అంటుకొనిపోయి ఉండేటట్లు చేయగలుగుతున్నాడు. తన రామాయణ పాపపరిహారదక్ష తీర్థాలలో పదేపదే క్రుంకులిడేటట్లు పాఠకుని తరుమగలడు. ఈ స్నాన ఫలితంగా - పాఠకుడు, ప్రేమపూర్ణమైన ఆద ర్శంతో - ధర్మసంరక్షణ విషయంలో స్వయంగా పాల్గొనవలెనన్న గాఢా సక్తితో - సత్యం శివం సుందరములపట్ల నిశితతర పరిజ్ఞానంతో - పార మార్థిక విషయాలను గురించి ప్రశ్నించేదానికి ద్విగుణీకృత ధైర్యంతో-వాటిని పరిష్కరించుటకు అవసరమైన ఆత్మప్రత్యయంతో పఠనానంతరం (పాఠ కుడు) బయటబడుతున్నాడు.

ఈ రచనా సామర్థ్యమునంతా ఆయన, దైవదత్తమైన ఉత్తమోత్తమ కవితాశక్తితో సముపార్జించుకొంటున్నాడు.

కంబమహాకవి కవిత్వమందలి లయ విన్యాసములో నిరుపమాన పరి పూర్ణత - వైవిధ్యము - సామర్థ్యము నిండియున్నవి. తాను ఉపయోగించే అచ్చుల హల్లుల రుతమును సమ్మోహన చాతుర్యంతో ప్రస్తారం గావించుట

చేత, ఆ ధ్వనులు ఎట్టి క్లిష్ట మానసిక స్థితినిగాని ఎట్టి భావావేశమునుగాని ఉదాత్త అలౌకిక రూపంలో ప్రదర్శించగలిగి ఉన్నవి. ఆయన సృష్టించిన లయ విన్యాసాలు పాఠకుని వాచాల మానసాన్ని మూగజేసి, బాహ్యాభావ సమ్మర్దముచేత ఆకర్షింపబడక, కవి ఒసంగే సందేశాన్ని గ్రహించను సంసిద్ధము చేసిపెట్టును; ఈ సృజన చాతురి అంతా, ఆయన క్లేశ రహిత సహజ కవితాధారా ముద్రితమై, కృత్యాద్యవస్థయందు కలుగు వేదన - సంశయాలను ఏమాత్రమూ బయట బెట్టదు. ప్రార్థనార్ద్రముగాని జగత్సృష్టి నిగూఢ ప్రయోజనాలను అభివర్ణించే పట్టుననుగాని, జీవిత అంతర్భాగమందలి క్షణ ప్రభలను వివరించే సందర్భమమునగాని కంబుని లయ సౌభాగ్యము పాఠకుని దీర్ఘ రసానుభూతిలో ముంచివేయును.

ఇట్టిది గదా కంబమహాకవి కవితా సౌరభ్యము! కాబట్టే తమిళులు, అబాలగోపాలము కంబుని కవిచక్రవర్తిగా పట్టాభిషేకము చేసినది!

## గ్రంథ సూచిక

కంబ మహాకవిని గురించి తమిళంలో వెలువడిన గ్రంథములు


1. కంబర్ తరుం రామాయణం - రసికమణి టి. కె. చిదంబరనాథ ముదలియార్.
2. కంబర్ యార్ - ,,
3. కంబరామాయణ సారం - వి. పి. సుబ్రమణియ ముదలియార్.
4. వీర మానగర్ - డా॥ ఆర్. పి. సేతు పిళ్లై.
5. కంబ చిత్రం - పి. శ్రీ ఆచార్య.
6. అశోకవనం - ఆచార్య ఎ. ముత్తుశివం.
7. కంబర్ కావ్యనిలై - సో. మురుగప్ప.
8. కల్వియిల్ పెరియవర్ కంబర్ - ఎ. వి. సుబ్రహ్మణ్య అయ్యర్
9. రావణన్ మాట్చియుం వీళ్చియుం - ఆచార్య ఎ. యస్. జ్ఞానసంబంధం.
10. సీతాకల్యాణం, పాదుకా పట్టాభిషేకం - టి. యం. భాస్కర తొండైమాన్.
11. కంబరామాయణం - వి. యం. గోపాలకృష్ణమాచారియార్.
12. ఉంగళ్ కంబర్ - వందిత గోష్ఠి.

ఇంగ్లీషు

1. స్టడీస్ ఇన్ కంబరామాయణ - వి. వి. యస్. అయ్యర్.
2. సెలెక్ట్ ట్రాన్స్‌లేషన్స్ ఫ్రం కంబన్ - వి. యస్. ముదలియార్.